# ప్రవక్తలు ఎవరు?




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org



# ప్రవక్తలు ఎవరు?


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-40 ద్వితీయ ముద్రణ : జూన్-2018

ప్రతులు : 1000 వెల : 50/-

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన

77) ద్యానము–ప్రార్థన–నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం–గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము–ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ–రావణబ్రహ్మ–భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) సుప్రసిద్ధి బోధ.
98) సిద్ధి బోధ.
99) ప్రవచన మాలిక
100) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
101) రూపము మారిన గీత.
102) సున్న.
103) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు–అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్–అలక్‌నిరంజన్.
05. మాయకుడు–అమాయకుడు.
06. తల్లి తండ్రి–గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ–పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం–దేహం మోహం.
11. ఎదమీదముద్ర–తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు–రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు–ఆరు–తొమ్మిది.
15. మాయ మర్మము– ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం–లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము–మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు–ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం– తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం– రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు–కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు–అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక ప్రసంగములు

06 *(DVD'S)*

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్టి-సృష్టికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.

82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య.
132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం.
138. అధిపతి.
139. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా



**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి (ప్రెసిడెంట్)**
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)**
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్రెసిడెంట్)**
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 527 3436, +1(210) 668 8963

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# ప్రవక్తలు ఎవరు?

వక్త అనగా బాగా చెప్పువాడు లేక బాగా మాట్లాడువాడు అని చెప్పవచ్చును. ఒక విషయమును గురించి బాగా మాట్లాడువానిని వక్త అని చెప్పుచుందుము. అందరూ మాట్లాడలేరు, కొందరు మాత్రము మాట్లాడు స్థోమతకల్గి మాట్లాడుచుండుట వలన, కొందరిని మాత్రమే వక్తలు అని అనుచున్నాము. పదిమందిలోకానీ, వందమందిలోగానీ నిర్భయముగా, నిరాటంకముగా మాట్లాడు వక్తలు కొందరుండగా, వారిలో ముఖ్యమైన విషయమును, సారాంశమైన విషయమును గురించి మాట్లాడువారు అరుదుగా ఉందురు. అటువంటి వారిలో ముఖ్యమైన వాటిలో అతి ముఖ్యమైనదీ, రహస్యమైన వాటిలో అతి రహస్యమైనదీ ఏదైతేవుందో, దానిని గురించి చెప్పువాడు చాలా అరుదుగా ఉండును. అటువంటి అరుదైన వ్యక్తిని ముఖ్యమైన వక్తగా గుర్తించి అతనిని ప్రవక్త అనడము జరుగు చున్నది. ఒక విషయమును బాగా వ్యక్తపరుచువానిని వక్త అని అంటున్నాము. వ్యక్తపరచబడు విషయము సాధారణమైనదిగా ఉండుట వలన, ఆ విషయమును ఎంత బాగా చెప్పినా వానిని వక్త అనియే అందురు. ఎంతో నైపుణ్యముగా మాట్లాడు స్థోమతయున్నా, ఎంతో తెలివిగా మాట్లాడినా అతని చేత చెప్పబడు విషయము సర్వసాధారణ విషయమైయుండుట వలన, గొప్ప సారాంశమైన విషయము కాకపోవడము వలన మాట్లాడిన వ్యక్తిని వక్త అంటున్నాము.

ప్రపంచములో అన్నిటికంటే మించిన విషయమూ, అన్ని రహస్యము లకంటే రహస్యమైనదీ, తెలియదగిన విద్యల్లోకెల్ల ముఖ్యమైనదీ దేవుని జ్ఞానము మాత్రమే కలదు. సర్వసాధారణముకాక అసాధారణ విషయమైన దైవజ్ఞానమును చెప్పగలుగు వక్తను ప్రవక్త అంటున్నాము. దీనినిబట్టి అన్నిటికంటే గొప్పదైన ఒక్క దైవ జ్ఞానము తప్ప మిగత విషయములను

ఎలాగ చెప్పినా, ఎట్లు చెప్పినా చెప్పు వానిని వక్త అని అనవచ్చునని తెలియుచున్నది. విన్న దానిని గానీ, చూచిన దానినిగానీ, చదివిన దానినిగానీ వివరించి చెప్పువానిని బోధకుడు అని అంటాము. తాను ఇతరుల చేత నేర్వగలిగిన దానిని తిరిగి తెలియని వారికి చెప్పువానిని బోధకుడు అంటాము. తాను ఇతరుల చేత తెలిసినదానిని తెలియనివారికి చెప్పడమును బోధించడము అని అంటాము. అలా బోధించు వానిని బోధకుడు అంటాము. తనకు తెలిసిన దానిని తెలియనివారికి చెప్పువానిని వక్త అని కూడా అంటాము. దీనిప్రకారము వక్త అనినా, బోధకుడు అనినా ఒకటేనని తెలియుచున్నది. బోధకుణ్ణి వక్త అని అనవచ్చును. వక్తను బోధకుడు అని అనవచ్చును. వక్త వ్యక్తపరుచునది గానీ, బోధకుడు బోధించునదిగానీ అది సర్వసాధారణ ప్రపంచ విషయమై ఉంటుంది.

తాను నేర్చినది, ఇతరుల చేత విన్నది అయిన దేవుని జ్ఞానమును తెలియనివారికి బోధించువాడు బోధకుడే అయినా అతనిని 'ప్రబోధకుడు' అంటాము. అలాగే గతములో ఇతరులచేత తాను నేర్వగలిగిన దైవజ్ఞాన విషయములను తెలియనివారికి వ్యక్తపరచు (తెలియజేయు) వక్తను 'ప్రవక్త' అని అంటాము. చెప్పబడు విషయము అన్నిటికంటే ప్రత్యేకమైనది, అన్నిటికంటే గుహ్యమైనది. కావున చెప్పబడు జ్ఞానమునుబట్టి చెప్పు వానిని ప్రవక్త అని అంటున్నాము. ప్రపంచ విషయములను ఎంత బోధించినా అతనిని బోధకుడనే అంటాము. దైవ విషయములను కొద్దిగా బోధించినా వానిని ప్రవక్త అనియే అంటాము. ప్రపంచ విషయములను బోధించువాడు గానీ, దైవ విషయములను బోధించువాడుగానీ, ఇద్దరూ బోధకులే అగుదురు. అయితే ప్రపంచ విషయములను బోధించువానిని వక్త అనియూ, పరమాత్మ విషయములను బోధించువానిని ప్రవక్త అనియూ అనడము జరుగుచున్నది.

ఈ పద్ధతి ప్రకారము ఎవరైనా వక్తలూ కావచ్చును. అలాగే ఎవరైనా ప్రవక్తలూ కావచ్చును. ఇప్పుడు కొందరు ప్రశ్నించుటకు అవకాశము కలదు. వారి ప్రశ్నలు ఇలా కలవు.

**ప్రశ్న :-**మాది మారుమూల ఒక పల్లెటూరు. మా ఊరిలో చాలామందికి చదువురాదు. మా ఊరిలో ప్రభుత్వ పాఠశాల కూడా లేదు. అందువలన మేము స్వయముగా ఒక వ్యక్తిని బోధకునిగా (టీచర్‌గా) నియమించుకొని అతని చేత పగలు సమయములో మా పిల్లలకు బడిలో చదువు చెప్పించు చున్నాము. రాత్రిపూట పెద్దవారమైన మేము అతని చేత భారత, భాగవత, రామాయణగాథలను చెప్పించుకొనుచుందుము. పగలు బడివలన మా పిల్లలకు ప్రపంచ చదువు వస్తున్నది. రాత్రిపూట భాగవతమును, రామాయణమును చెప్పించుకొనుట వలన మాకు కొంత దైవభక్తి ఏర్పడుచున్నది. ఈ విధముగా ఒకవైపు మా పిల్లలూ, ఒకవైపు మేమూ బాగుపడుచున్నాము. అయితే మేము నియమించుకొన్న టీచర్‌ను (బోధకుణ్ణి) వక్త అని చెప్పాలా? లేక ప్రవక్త అని చెప్పాలా? ఏమని చెప్పాలి?

**జ॥** మీరు నియమించుకొన్న టీచర్ పగలు పిల్లలకు ప్రపంచ పాఠాలు చెప్పుచుండుట వలన అతనిని బోధకుడు అని అనాలి. అతను బోధకుడు అయినందున అతనిని వక్త అని అనవచ్చును. ఇకపోతే రాత్రి సమయములో పెద్దలకు భాగవత, రామాయణములను బోధించుట వలన పెద్దలలో భక్తి భావము పెరిగినది. భక్తి భావము పూర్తి దేవునికి సంబంధించినది కానందున అది కూడా దేవుని మినహాగాయున్న ప్రపంచ సంబంధమేనని అర్థమగుచున్నది. అందువలన పెద్దలకు బోధించిన దానివలన కూడా అతను వక్తగానే చెప్పబడుచున్నాడు. ప్రవక్తగా చెప్పబడడము లేదు.

**ప్రశ్న :-** భక్తి భావమును కల్గించు భాగవత, రామాయణములను గురించి చెప్పినా, అతను ప్రవక్త కానప్పుడు, దేనిని గురించి చెప్పితే అతను ప్రవక్త కాగలడు?

**జ॥** మీ ఊరిలో పిల్లలకు చదువు, పెద్దలకు భాగవత రామాయణమును చెప్పు టీచర్ కుటుంబము ప్రక్కనేయున్న నగరములోయుండుట వలన అతను ప్రతి ఆదివారము తన కుటుంబమువద్దకు పోయివస్తున్నాడు. ఆ విధముగా పోయివచ్చు అతను ఆదివారము రాత్రి 8 గంటలనుండి 10 గంటల వరకు వారింటి ప్రక్కనేయున్న గుడిలో భగవద్గీతను చదివి చెప్పు కార్యమును చేయుచున్నాడు. అక్కడ భగవద్గీతను చదివి అక్కడున్న వారందరికీ వివరముగా చెప్పుట వలన అతను ప్రవక్త అగుచున్నాడు. అతనిని ఎవరూ ప్రవక్త అని పిలువకున్నా అతనిని మనము ప్రవక్త అని చెప్పాలి. అతను 8 నుండి 10 గంటల వరకు చెప్పునది దేవుని జ్ఞానము. భగవద్గీత దేవుని జ్ఞానమైనందున, దానిని చెప్పువాడు వక్త కాకుండ ప్రవక్త అగునని మనము ముందే చెప్పుకొన్నాము. పల్లెటూరిలో స్కూలులో చదువు చెప్పినా, ఊరిలో భాగవతమును చెప్పినా, అదియంతయు దేవునికి సంబంధించిన జ్ఞానము కాదు కనుక అక్కడ వక్తగానే చెప్పవలసి వచ్చినది. ఈ విధముగా ఒకే వ్యక్తి కొన్నిచోట్ల వక్తగా మరికొన్ని చోట్ల ప్రవక్తగా చెప్పబడుటకు కారణము అతను చెప్పుచున్న బోధయేనని తెలియవలెను.

**ప్రశ్న :-**ఒక సామాన్య ఉపాధ్యాయుడు (టీచర్) భగవద్గీతను చదివి చెప్పితే, అతనిని ప్రవక్త క్రిందికి జమకట్టి ప్రవక్త అంటే, ఆ విధముగా ప్రవక్తలు ఎందరో కాగలరు. అప్పుడు ఎంతో పేరు ప్రఖ్యాతులనుకల్గిన ప్రవక్తల వరుసలో సామాన్య మనుషుల పేర్లు చేర్చి చెప్పడము వలన పెద్ద ప్రవక్తలకు అగౌరవము కాదా?

**జ॥** ఒక సూత్రము ప్రకారము ప్రవక్తలు ఎవరు అను విధానమును తెలియజేశాముగానీ, పెద్దప్రవక్తల ప్రక్కన చిన్న ప్రవక్తలను నిలబెట్టాలను ఉద్దేశ్యముతోకాదు. చిన్న ప్రవక్తలను పెద్ద ప్రవక్తల ప్రక్కన చేర్చి చెప్పినా, చెప్పకపోయినా, ప్రవక్తలు ప్రవక్తలే, వక్తలు వక్తలే. పెద్ద ప్రవక్తలుగానీ, చిన్న ప్రవక్తలుగానీ దేవుని జ్ఞానమును చెప్పుట వలననే ప్రవక్తలైనారని మరువకూడదు.

**ప్రశ్న :-** శ్రీకృష్ణుడు భగవంతుడని మీరే చెప్పారు. గ్రంథములో కూడా భగవంతుడని ఉన్నది. కృష్ణుడు భగవద్గీతను చెప్పాడు. భగవద్గీత దేవునికి సంబంధించిన జ్ఞానమును బోధించుచున్నది. అందువలన శ్రీకృష్ణున్ని సూత్రము ప్రకారము ప్రవక్తయని అనవచ్చును. అయితే అదే భగవద్గీతను చదివి చెప్పేవాడూ ప్రవక్తే అయినప్పుడు, గీతను వ్రాసిన కృష్ణునితో సమానముగా ప్రవక్తయని గీతను చదివినవాడు చెప్పబడడము సమంజసమేనా?

**జ॥** శ్రీకృష్ణుడు గీతను చెప్పాడు, కావున ప్రవక్త అయినాడు. మనిషి గీతను చదివి చెప్పాడు, కావున ప్రవక్త అయినాడు. ఇక్కడ లేని గీతను సృష్ఠించి చెప్పినవాడు శ్రీకృష్ణుడు. స్వయముగా జ్ఞానమును చెప్పినవాడు దేవుడేయగును. అందువలన కృష్ణున్ని దేవుడు అంటున్నాము. ఉన్న జ్ఞానమును తెలియువాడు మనిషియగును. ఉన్న జ్ఞానమును తెలిసి వివరముగా చెప్పువాడు ప్రవక్తేయని పిలువబడినా అతను మనిషియే అగును. దైవ జ్ఞానమును గీతరూపములో చెప్పినవాడు దేవుడుకాగా, దానిని తెలిసినవాడు మనిషియగును. అయితే ఇక్కడ దైవజ్ఞానమును చెప్పుట వలన ప్రవక్త అను పేరుతో ఇటు దేవుడు, అటు మనిషి సమానముగా పిలువబడినా, వారు ప్రవక్త అను పేరులో సమానమైనా, వారి హోదాలో

ఒకరు పరమాత్మ, మరొకరు జీవాత్మయని తెలియవలెను. పరమాత్మ దేవుడుకాగా, జీవాత్మ మనిషి అగుచున్నాడు. జీవుడు దేవుడు ఇద్దరూ ఆత్మలే అయినా వారిలో తారతమ్యములు గలవు. ఒక ఆత్మ పెద్దదైన పరమాత్మకాగా, మరొక ఆత్మ చిన్నదైన జీవాత్మగాయున్నది. అందువలన ముఖ్యమైన సమాచారమును చెప్పువారు ఎవరైనా ప్రవక్తలు కావచ్చునుగానీ, ప్రవక్తలు అయినంత మాత్రమున అందరూ సమానము కారు.

ఉదాహరణకు తిరుపతి వెంకటేశ్వర స్వామి దర్శనార్థము గుడి బయట వరుసలో నిలుచున్న వారందరినీ భక్తులనియే చెప్పాలి. అప్పుడు భక్తులను పదము అందరికీ వర్తిస్తుంది. అయితే ఆ వరుసలో ఎందరో పేదవారున్నారు, ధనికులు ఉన్నారు, అట్లే మధ్య తరగతివారున్నారు. వరుసలోనున్న దానివలన అందరినీ భక్తులనియే చెప్పుచున్నాము. అందరూ భక్తులని పిలువబడినంతమాత్రమున ధనికుడు పేదవాడుకాడు, పేదవాడు ధనికుడు కాడు. లేకపోతే ఇద్దరూ సమాన ధనికులు కారు. భక్తులను పేరు అందరికీ వర్తించినంతమాత్రమున, వారి ఆర్థిక పరిస్థితులలో మార్పు ఎట్లురాదో, తర్వాత ఏ విధముగా ధనికుడు ధనికునిగానే, పేదవాడు పేదవానిగానే ఉంటాడో, అదే విధముగా ప్రవక్తలను పేరు దైవమార్గమును బోధించిన వారికి వచ్చినప్పుడు ప్రవక్తలు అను పేరు ఇటు దేవునికి అటు మనిషికీ ఒకే విధముగా వర్తించినా, ఆత్మల విషయములో ఎప్పటికీ సమానము కారు. అందరూ సమానముగా ప్రవక్తలని పిలువబడినా, తర్వాత జ్ఞానములో ధనికుడైన దేవుడు దేవుడే, జ్ఞానములో పేదవాడైన జీవుడు జీవుడే అగును. ప్రవక్తలు అయినంతమాత్రమున వారు వీరుగా, వీరు వారుగా మారుటగానీ లేక సమానముగా మారుటగానీ జరుగదు. ఏ విధముగా గుడిముందర భక్తులైన వారందరూ ఎట్లు సమానముకారో, అదే

విధముగా బోధించడములో ప్రవక్తలైన వారందరూ సమానము కారు. బోధించిన వారిలో భగవంతుడైన దేవుడు ఉండవచ్చును. పండితుడైన మనిషీ ఉండవచ్చును.

**ప్రశ్న :-**ప్రవక్త అంటే చాలా గొప్పవాడనీ, ఎవరికీ తెలియని జ్ఞానము తెలిసినవాడనీ భావించాము. ఇప్పుడు మీరు చెప్పుమాట ప్రకారము భూమిమీద ప్రవక్తలు ఎవరైనా కావచ్చును. ఎంతమందయినా ఉండ వచ్చును. అలాగయితే ప్రవక్తలు ఒకరిద్దరు కాదు ఎంతమందైనా ఉండవచ్చును అని అర్థమగుచున్నది. ఇంతకుముందు మా భావములో ఒక మతానికి ఒక ప్రవక్త ఉంటాడనీ, హిందువులకు శ్రీకృష్ణుడు ప్రవక్తయనీ, క్రైస్తవులకు ఏసు ప్రవక్తయనీ, ముస్లీములకు ముహమ్మద్‌గారు ప్రవక్తయనీ అనుకొనియుంటిమి. మీ సూత్రము ప్రకారము హిందువులలో గీతను బోధించువారు, క్రైస్తవులలో బైబిలు జ్ఞానమును బోధించువారు అందరూ ప్రవక్తలే అని తెలియుచున్నది. అంతేకదా!

జ॥ సూత్రబద్ధముగా గీతను బోధించిన కృష్ణున్ని, అదే గీతను బోధగా చెప్పుచున్న మనుషులను సమానముగా ప్రవక్త అని అనవచ్చును. అలాగే బైబిలు జ్ఞానమును మొదట బోధించిన ఏసును, తర్వాత బైబిలు బోధను బోధించు బోధకున్ని సమానముగా ప్రవక్త అని అనవచ్చును. అంత మాత్రమున శ్రీకృష్ణుడు మరియు గీతాబోధకుడు సమానము కారు. అలాగే ఏసు, బైబిల్ బోధకులు సమానము కారు. ఉప్పు కప్పురము ఒక్క పోలికగా కనిపించినా, వాటి రుచులు వేరైనట్లు కృష్ణుడు, గీతాబోధకుడు ఇద్దరూ ఒకే పేరుగల ప్రవక్తలుగా కనిపించినా, పురుషులందు పుణ్యపురుషులు వేరన్నట్లు ప్రవక్తలలో దేవుడువేరు, జీవుడు వేరుగాయున్నారు. దైవ జ్ఞానమును బోధించువాడు ప్రవక్త అను సూత్రము దైవజ్ఞానమును

బోధించువారందరికీ వర్తించినా, ప్రవక్తలలో మనిషివేరు దైవమువేరని తెలియవలెను.

**ప్రశ్న :-**దేవదూతలు ప్రవక్తలు కారా?

**జు॥** దేవదూతలు అను పదము ప్రస్తుత హిందూమతములో ఎక్కడా లేదు. ఎవరినైనా దేవతలు అనడము తప్ప, దేవదూతలు అను పదమును వాడడము లేదు. అలాగే ఇతర మతములలో ప్రవక్తలు అను మాటను వాడుచున్నారు, కానీ హిందూమతములో వాడడము లేదు. హిందూ మతములో కొందరు జ్ఞానులైన వారు దూత, అవదూత అను పదములను వాడుచున్నారు. మతిస్థిమితము లేనివారినీ, మతిభ్రమించి, తిక్కముదిరి గుడ్డలు తీసివేసి తిరుగువారినీ దూతలనీ, అవదూతలనీ చెప్పడము జరుగు చున్నది. ప్రస్తుతము నీవు అడిగిన ప్రశ్నకు జవాబును సూటిగా చెప్పితే, దైవజ్ఞానమును బోధించు దేవున్నయినా ప్రవక్త అని అన్నప్పుడు, జ్ఞానమును చెప్పిన దేవదూతలను కూడ ప్రవక్తలనియే అనాలి. దేవదూతలు ఒక సమయానికి ప్రవక్తలైనా, తర్వాత వారు ఎప్పటికీ దేవదూతలుగానే యుందురు. చాలామంది హిందువులకు ప్రవక్తల వివరముగానీ, దేవ దూతల విషయముగానీ తెలియదనియే చెప్పాలి. దూతల విషయానికి వస్తే హిందువులకు అవదూతలను వారు మాత్రము తెలియును. అవదూతల విషయములో కూడా ఎవరు అవదూతలను వివరము తెలియక గుడ్డలు ధరించని నగ్న శరీరులను అవదూతలనుకోవడము జరుగుచున్నది.

**ప్రశ్న :-**దిగంబరులు అవదూతలు కారా?

**జు॥** ముమ్మాటికీ కారు. దిగంబరుల అర్థము వేరు. అవదూతల అర్థము వేరని తెలియవలెను. దూతలు అనగా సమాచారమును తీసుకొని

వచ్చెడి వారు. అవదూతలనగా అవదిలేని పరమాత్మ జ్ఞానమును తీసుకొని వచ్చెడి వాడని అర్థము. అవది అనగా ఎల్లలు అనీ, హద్దు అనీ అర్థము. పరమాత్మ ఎల్లలు లేకుండా వ్యాపించియున్నవాడు. ఇక్కడి వరకే పరమాత్మ ఉన్నాడని హద్దు ఏర్పరచి చెప్పలేము. పరమాత్మ అంతటా వ్యాపించి యున్నవాడు, కనుక అటువంటి దేవుని సమాచారమును తెచ్చువానిని అవధూత అనడము జరిగినది. అవధూత అనగా దేవుని సమాచారమును తెచ్చి అందించువాడని అర్థముతో చెప్పుకోవలెను. ఇకపోతే దిగంబరులని వేరు, వారి పని వేరు. సహజముగా గుడ్డలులేనివారిని దిగంబరులు అనడము అలవాటైపోయినది. గుడ్డలు ధరించని వారిని నగ్నముగా ఉన్న వారని చెప్పవచ్చును. **గ్న** అంటే దాచుకోవడము అని అర్థము. **న** అంటే లేదు అని అర్థము. **నగ్న** అనగా దాచుకోనివాడని అర్థము. శరీరమును దాచుకొనుటకు గుడ్డలు ధరించనివానిని నగ్నముగా ఉన్నవాడనీ, నగ్న శరీరుడనీ అనడము జరుగుచున్నది. ఇకపోతే అంబరము అనగా ఆకాశమనీ, అంబరులు అంటే ఆకాశమందు సంచరించువారనీ, దిగ అనగా దిగివచ్చినవారనీ, దిగంబరులు అనగా ఆకాశమునుండి దిగివచ్చిన వారని అర్థము. ఆకాశము నుండి దిగివచ్చిన గ్రహములు, భూతములు ఎన్నో మనుషులకు కనిపించ కుండా భూమిమీద తిరుగుచున్న మాట వాస్తవమే, అయినా ఆ విషయము ఎవరికీ తెలియదనియే చెప్పవచ్చును. భూమిమీద మనుషులను హింసించుటకే కొన్ని భూతములు, గ్రహములు అప్పుడప్పుడు దిగివచ్చి చేయవలసిన కార్యము చేసి తిరిగి పైకి పోవుచుందునని మేము అనేకమార్లు చెప్పాము. అలా వచ్చిపోవు వారిని దిగంబరులు అని పూర్వము అనెడి వారు. నేడు ఆ వివరము తెలియని దానివలన దిగంబరులు అంటే గుడ్డలు ధరించని నగ్న శరీరులని అనుకోవడము జరుగుచున్నది. అవధూత

అనబడువాడు ఎవరికీ తెలియనివాడై, మనిషి ఆకారములోనే వచ్చి దేవుని సమాచారమును మనుషులకు చేరవేసిపోవును. దిగంబరులు అనబడు గ్రహములు, భూతములు ఆకాశమునుండి కనిపించకుండా వచ్చి, కనిపించ కుండావుండి సమయమొచ్చినప్పుడు మనుషలను శిక్షలకు గురిచేసి పోవు చుందురు. దేవుని జ్ఞానమును తెలియజేయు అవదూత అనబడువాడు అవధూతగా తెలియబడక, జ్ఞానమును తెలియజేయడము వలన మొదట ప్రవక్తగా తెలియబడును. అయితే అతనే అవదూత అని ఎవరికీ తెలియదు. భూమిమీద సమాచారమును తెలియజేయుటకు వచ్చినవారిలో ఒక్కొక్కప్పుడు సాక్షాత్తు భగవంతుడు కూడ ఉండవచ్చును. అయితే ఇతను ఫలానావాడని చెప్పుటకు వీలుపడదు. మరికొన్ని సమయములలో ఖగోళములోని గ్రహములుగానీ, భూతములుగానీ జ్ఞానమును తెలుపు వారిగా వచ్చినా వారు ఎవరికీ కనిపించక తమకు తెలిసిన జ్ఞానమును తెలిపిపోవుదురు.

భూమిమీద దేవుడు తన జ్ఞానమును తెలుపు విధానములు మూడు కలవు. అందులో మొదటిది వాణి ద్వారా (ఆకాశవాణి ద్వారా) తెలియజేయునది. రెండవది తెరవెనుక నుండి కనిపించకయుండి చెప్పడము. మూడవది తన దూతను పంపి అతని ద్వారా చెప్పించడము. ఈ మూడు విధానము లలో దూతద్వారా చెప్పించడమును భగవంతునిద్వారా చెప్పించడమని అర్థము చేసుకోవలెను. అదే విధానము ప్రకారము కృష్ణుని ద్వారా భగవద్గీతను చెప్పించడము జరిగినది. వాణి ద్వారా చెప్పించడము సృష్ట్యాదిలోనే జరిగినది. ఇకపోతే తెరవెనుకనుండి చెప్పించడము అనునది ఖురాన్ గ్రంథమును ముహమ్మద్ ప్రవక్తకు చెప్పినప్పుడు జరిగినది. జిబ్రయేల్ అను కనిపించని దూత (దేవదూత) ప్రవక్తగారికి చెప్పడము జరిగినది. ఈ విధముగా మూడు విధానములు జరిగిపోయినవి. అంతేగాక

ఎప్పుడైనా దేవుని జ్ఞానము భూమిమీద మనుషులకు తెలియాలంటే ఈ మూడు విధానముల ద్వారానే తెలియబడును.

**ప్రశ్న :-** ప్రపంచములో ఈ మూడు విధానముల ద్వారానే జ్ఞానము తెలియునని చెప్పుటకు మీ వద్ద ఆధారమున్నదా?

**జ॥** మేము ఎప్పుడూ శాస్త్ర ఆధారములేని విషయమును చెప్పము. పవిత్ర ఖుర్ ఆన్ గ్రంథములో 42వ సురా, 51వ ఆయత్‌లో దేవుడు మూడు విధముల జ్ఞానమును తెలియజేయు విధానమును తెలుపడము జరిగినది. అది ఇలా కలదు చూడండి. " ఏ మానవునితోను దేవుడు ప్రత్యక్షముగా (ముఖాముఖిగా) సంభాషించడము జరుగదు. అయితే వహీ ద్వారా, లేదా తెర వెనుక నుంచీ, లేదా ఒక దూతను పంపడము ద్వారా దేవుడు తన జ్ఞానమును తెలియజేయును. వచ్చిన దూత అల్లా ఆజ్ఞను అనుసరించి మనుషులు కోరిన సందేశాన్ని అందజేస్తాడు. నిశ్చయంగా ఆయన మహోన్నతుడు, వివేకవంతుడు." ఈ విధముగా దేవుడు తన మూల గ్రంథములలో ఒక దానియందు చెప్పియున్నా, ఇది మా గ్రంథము అని చెప్పుకొను ముస్లీమ్‌లలో కొందరికి ఈ వాక్యము యొక్క అర్థము సరిగా తెలియకుండా పోయినది. నిశ్చయముగా ఆయన మహోన్నతుడు, వివేక వంతుడు అను మాటలోని నిజమైన అంతరార్థము కొందరికి నేటికినీ తెలియదనియే చెప్పవచ్చును.

**ప్రశ్న :-** దేవుడు తెలుపు మూడు మార్గముల జ్ఞానము బోధరూపములోనే ఉండును కదా!

**జ॥** దేవుడు స్వయముగా కాకుండా మూడు పద్ధతుల ద్వారా జ్ఞానమును తెలియజేయుచున్నాడు. ఈ విషయము చాలామంది హిందువులకు కూడా

తెలియదు. ఒక గ్రంథములో చెప్పబడిన విషయము అందరికీ సంబంధించిన దని తెలియక ఖుర్ఆన్‌లో చెప్పినది ముస్లీమ్‌లకనీ, భగవద్గీతలో చెప్పినది హిందువులకనీ అనుకోవడము జరుగుచున్నది. దేవుడు ఏ మతములోని మనుషులకైనా పై మూడు విధానముల ద్వారా తన జ్ఞానమును తెలియ జేయుచున్నాడు. ఎక్కడ ఏ విధానమును ఉపయోగించి చెప్పినా, ఆయన జ్ఞానమంతయు బోధరూపములోనేయున్నట్లు తెలియుచున్నది. దేవుడు తెలియజేయు బోధ సాధారణ బోధలాగా కాకుండా అది ముఖ్యమైన బోధగా, శాస్త్రబద్ధమైన బోధగా ఉండును. అటువంటి బోధకు "ప్ర" అను అక్షరమును కలిపి ప్రబోధయని చెప్పవచ్చును. ప్ర అను అక్షరము విశేషతను చూపుచున్నది. కావున దేవుని బోధను జ్ఞానులు ప్రబోధయని చెప్పడము జరిగినది. ప్రబోధను బోధించిన దూతకు కూడా ప్ర అను అక్షరమును చేర్చి "ప్రదూత" అనికూడా అన్నారు. ప్రదూత చెప్పినది ప్రబోధయనీ, ప్రజ్ఞానమనీ చెప్పవచ్చును. "ప్ర" ప్రత్యేకతను సూచించునది కావున, దేవుని బోధను ప్రబోధయనీ, దేవుని జ్ఞానమును ప్రజ్ఞానమని చెప్పడము జరిగినది.

**ప్రశ్న :-** భగవద్గీతను చెప్పిన కృష్ణుడు ప్రవక్తనా, కాదా?

**జ॥** దైవజ్ఞానమును బోధించువారెవరైనా సూత్రము ప్రకారము ప్రవక్తలే అగుదురు. కృష్ణున్ని కూడా ప్రవక్త అనవచ్చునని ముందే చెప్పాము. తాత్కాలికముగా ఆయన ప్రవక్త అనబడినా ఆయన శాశ్వితముగా ప్రవక్త కాడు. మనుషులకు జ్ఞానము తెలియజేయు మూడు విధానములలో దేవుని చేత పంపబడిన దూతగా వచ్చినవాడు శ్రీకృష్ణుడు. కృష్ణుడు వచ్చిన దూతయే అయినా, కృష్ణుడు పంపబడినవాడే అయినా, సత్యాన్వేషణ చేసి చూస్తే, వాస్తవముగా ఆయన పంపబడినవాడు కాడు. అలాగే ఆయన దూతయూ కాడు. కృష్ణుడు పంపబడినవాడైనా, దూతగా వచ్చినవాడైనా అతను

పంపబడలేదు, దూతగారాలేదు. అక్బర్ చక్రవర్తి స్వయముగా పురపౌరునిగా వేషము ధరించి బాటసారివలె కొన్ని ఊర్లు తిరిగి స్వయముగా తన పాలనను గురించి తెలుసుకొన్నాడు. అక్బర్ చక్రవర్తి పౌరుని వేషము ధరించినది నిజమే, బాటసారిగా తిరిగినది నిజమే. ఆ విషయము వాస్తవమే అయినంత మాత్రమున పురపౌరుని వేషములోనున్న వానినీ, బాటసారి అయిన వానినీ అక్బర్ కాదనుటకు వీలులేదు. పౌరుడు, బాటసారి తాత్కాలికమే. అక్బర్ శాశ్వితము. అదే విధముగా కృష్ణుడు దూతగా వచ్చినా, పంపబడిన వాడైనా సత్యానికి ఆయన దూత గాడు, పంపబడినవాడు కాడు. వాస్తవానికి ఆయన పంపినవాడు అయినా దేవుడేనని చెప్పవచ్చును. ఎలాగైతే వచ్చినవాడు పౌరుడు, బాటసారి కాడుయనీ, వచ్చినవాడు స్వయముగా అక్బర్ చక్రవర్తి యేననీ ఎలా చెప్పగలుగుచున్నామో, అలాగే దూతగా వచ్చినవాడు, దూతగా పంపబడినవాడు స్వయముగా దేవుడేనని చెప్పుచున్నాము.

అలా చెప్పుటకు ఆధారమేమి అనీ, మీరు ఎలా చెప్పగలుగుచున్నా రనీ ఎవరైనా అడిగితే, దానికి మా జవాబు ఇలా కలదు. దేవుడు అంటే వెదుకబడేవాడుగానీ దొరికేవాడుకాడు. అటువంటి దేవుడు ఎక్కడున్నా ఒక్కడే ఉంటాడు. అట్లుకాకుండా తానున్న చోట తనకు తోడుగాయుండుట కనియో, తనకు సేవచేయు నిమిత్తమనియో వేరొకనిని ఉంచుకొనివుంటే, ఆయనకు దేవుడు అను పేరు వర్తించదు. ఎందుకనగా ప్రక్కవానికి తెలిసినవాడై పోవును. మరియు ప్రక్కనున్న వాని ద్వారా తాను ఎక్కడున్నదీ ఇతరులకు తెలిసిపోవును. అప్పుడు సులభముగా దేవుడు ఎవరికైనా దొరికిపోగలడు. వారందరూ తనను చూడగలరు. ఇంతవరకు దేవుడు ఎవరికీ కనిపించక రహస్యముగా ఉన్నాడంటే, ఆయన ఎవరినీ నమ్మి తన సేవకునిగా ఒక్కనిని కూడా నియమించుకోలేదు. దేవున్ని ఎంత

పొగిడినా ఆయన మాత్రము ఎక్కడా ఎవరికీ మోసపోకుండా యున్నాడు. ప్రపంచములో అత్యంత సన్నిహిత భక్తుడెవడైనా ఉండినా ఆ ఒక్కనిని కూడా నమ్మి తనవద్ద చేర్చుకోలేదు. దేవుడు మనుషుల యెడల ఎందుకంత జాగ్రత్తగాయున్నాడని ఎవరైనా అడిగిన, దానికి దేవుడయితే ఇలా జవాబు చెప్పగలడు. "మీరు మనుషులు, నేను దేవున్ని కనుక, మీరు కనిపించేవారు, నేను కనిపించనివాడిని కనుక, మీరు పుట్టారు, నేను పుట్టలేదు గనుక, మీకు అవయవములున్నవి, నాకు లేవు కనుక, మీకు కర్మలున్నవి నాకు కర్మలులేవు కనుక, అని" అనేక సమాధానములు వదలకుండా చెప్పగలడు.

ఇదంతయు గమనించితే దేవునివద్ద ఒక్కరు కూడా లేరు. ఆయన ఏకాకిగా ఒక్కడేయున్నాడు. అందువలన నేను నా దూతను పంపుచున్నాననీ, నా దూత నా జ్ఞానమే చెప్పుననీ ఆయన చెప్పినా, జ్ఞానము తెలిసినవాడు ఆయన మాటలోని సత్యమును తెలుసుకోగలడు. ఆయన వద్ద ఎవరూ లేరు కావున, ఆయనే వచ్చాడని తెలుసుకోగలడు. తనను ఎవరూ గుర్తించకుండాయుండుటకు దేవుడలా చెప్పాడనీ, జ్ఞాని అయినవాడు తెలుసుకోగలడు. అలా తెలియగల్గినవాడు దేవుని జ్ఞానములోని రహస్యములన్నీ తెలియగల్గును. అంతవరకు అర్థము కాకుండావుండి తప్పు దారి పట్టుటకు అవకాశమున్న జ్ఞాన సంశయములన్నియు తీరిపోవుచూ వచ్చును. అలా తెలియగలిగినవాడు అనతికాలములోనే దేవుని జ్ఞానమునూ, రహస్యమును తెలియగల్గి, దేవునివద్దకు చేరిపోవును. అటువంటి వానిని మోక్షము పొందాడని, పరమ పదము చేరాడని చెప్పవచ్చును.

**ప్రశ్న :-** ఇంతవరకు మీరు చెప్పిన దానిని నమ్మి, సత్యమే చెప్పుచున్నారనుకొన్నాము. అయితే ఇప్పుడు మీమాట మీద కొంత అనుమానము వస్తున్నది.

దానికి కారణమేమంటే. ఇంతవరకు దేవునివద్ద ఎవరూ లేరు అని చెప్పారు. కనీసము ఒక్కడంటే ఒక్కడు కూడా లేడని చెప్పారు. దేవుడు మనుషులను నమ్మడనీ తనవద్దకు చేర్చుకోడని కూడా చెప్పారు. మేము మీరు చెప్పినవన్నీ వింటూ వచ్చాము. ప్రస్తుతము ఇప్పుడు మీరు చెప్పిన మాటతో మాకు కొంత సంశయము ఏర్పడుచున్నది. దేవున్ని గురించి సత్యము తెలిసినవాడు మోక్షము పొంది దేవునివద్ద చేరిపోవునని ఇప్పుడు మీరు చెప్పారు. ముక్తిపొందినవాడు దేవుని సన్నిధానములో చేరిపోయి జన్మకు పోడని ఇతరులు కూడా చెప్పగా విన్నాము. మొత్తము మీద దేవుడు ఎవనినీ తనయొద్ద చేర్చుకోకున్నా, మనిషే మోక్షము పొంది ఆయన (దేవుని) వద్దకు పోవుచున్నాడు కదా! దీనికేమంటారు. మా మాటకు మీరు ఏమి సమాధానము చెప్పగలరు?

**జ॥** సరియైన సమయములో సరైన ప్రశ్న అడిగి నన్ను చిక్కుల్లోనికి త్రోయాలని చూస్తున్నారు. అయినా ఫరవాలేదు. ఇలాంటి ప్రశ్నలనే నేను కోరుకుంటున్నాను. మీరడిగిన ప్రశ్నకు జవాబు ఇలా కలదు. సంపూర్ణ జ్ఞానము తెలిసినవాడు తన కర్మలన్నీ లేకుండాపోయినప్పుడు, అతడు మోక్షము పొంది దేవునివద్దకు చేరునను మాట సత్యమే. అయితే దేవుడు తనవద్దకు వచ్చినవానిని చూచి, వీడు బయట నా ప్రక్కనేయున్నా మంచిది కాదని తలచి, అక్కడికిపోయిన వానికున్న ముక్కు, చెవులు కోసివేసి, రూపము లేకుండా చేసి, కాళ్ళు చేతులు విరగగొట్టి చలనము లేకుండా చేసి, నేను జీవుడనను జ్ఞాపకము లేకుండా తలమీద కొట్టి, చివరకు తనవలె నిరాకారున్ని చేసి, పేరు, పని ఏమీ లేకుండా చేసి తనవలె రూప, నామ, క్రియారహితుడైన తర్వాత తనలోనికి చేర్చుకొనును. అప్పుడు మోక్షము పొందినవాడు ఎవడూ దేవునికంటే బయట లేకుండాపోయి, దేవునిలోపలే దేవునివలె ఉండి

పోవుదురు. వాడే తాను, తానే వాడు అయిన తర్వాత అంతా ఒక్కటిగానే ఉండిపోవునుగానీ, తనకంటే వేరువాడు ఎవరూ ఉండడు. ఆ విధముగా ఎవరు చేరినా, ఎందరు చేరినా, వారందరు దేవుని లోపల ఐక్యమైయుండి పోయి, ఏమాత్రము వేరుకాక కలిసిపోయారు. రెండు అని చెప్పుటకు వీలులేక అంతా ఒక్కటిగా మారిపోయారు. అందువలన అక్కడ ఎవరూ లేరు, దేవుని దూతగా ఎవడూ రాడు. పేరుమార్చుకొని దూతగా వచ్చేవాడు దేవుడే. ఇందులో ఏమాత్రము సంశయము లేదు.

దేవుడు తన మూలగ్రంథమైన ఖుర్‌ఆన్‌లో, ఏదైనా ముఖ్యమైన జ్ఞానవాక్యము వచ్చినప్పుడు, ఆ వాక్యము చివరిలో ఏదో ఒక గుర్తింపును పెట్టియుంటాడు. అది ఖుర్‌ఆన్‌లో ఉండే గొప్పతనము. 42వ సురా 51వ ఆయత్‌లో కూడా చివరిలో ఒక మాట చెప్పాడు. అక్కడ ఆయన చెప్పిన మూడు విధానములలో చివరి దానియందు తన దూతను పంపి దేవుని ఆజ్ఞమేరకు దూతద్వారా కోరిన జ్ఞానమును తెలియజేయును అని కలదు. అంతటితో ఆ వాక్యమును ఆపక "నిశ్చయముగా ఆయన మహోన్నతుడు, వివేకవంతుడు" అని చెప్పడము జరిగినది. అక్కడ చెప్పినమాటను జిబ్రయేల్ తెరచాటునుండి కనిపించక చెప్పుచుండగా, ముహమ్మద్ ప్రవక్తగారు వినడము జరిగినది. అప్పుడు జిబ్రయేల్ ఎవరిని ఉద్దేశించి నిశ్చయముగా ఆయన మహోన్నతుడు, వివేకవంతుడని అన్నాడు అని ప్రశ్నించుకొని చూస్తే ముస్లీమ్ సమాజమంతా దూతను పంపి తన జ్ఞానమును తెలియజేయు దేవున్ని గురించే ఆ మాట జిబ్రయేల్ అన్నాడని చెప్పుచున్నారు. అక్కడున్న పరిస్థితినిబట్టి అందరూ అలాగే అనుకొనుటకు అవకాశమున్నా, జిబ్రయేల్ సృష్ట్యాదినుండి దేవుని సేవలోయుండి, దేవుని జ్ఞానమును సంపూర్ణముగా తెలిసినవాడు కనుక, జిబ్రయేల్ మనమను

కొన్నట్లు చెప్పలేదనీ, అక్కడ చెప్పినది వచ్చిన దూతను గురించి అనీ తెలియుచున్నది. దేవుని జ్ఞానము తెలిసినవాడు దేవున్ని వదలి, దేవుని చేత పంపబడిన దూతను పొగడునా అను ప్రశ్న కొందరిలో రావచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! ఇక్కడ బాగా గమనించితే, కనిపించకుండా తెరచాటునుండి చెప్పిన మహాజ్ఞాని జిబ్రయేల్, తనకున్న జ్ఞానము ప్రకారము దూతగా వచ్చిన వ్యక్తిని "నిశ్చయముగా ఆయన మహోన్నతుడు, వివేకవంతుడు" అని అన్నాడు. దేవున్ని తెలివైనవాడనీ (వివేకవంతుడనీ) మహోన్నతుడనీ చెప్పనవసరము లేదు. ఎందుకనగా! కనిపించు దూతగా వచ్చిన మనిషిని ప్రక్కవారితో పోల్చి, వారికంటే ఈయన తెలివైనవాడని తెలుపు నిమిత్తము, దూతను ఉద్దేశించి చెప్పియుండవచ్చును. అలాగే నీచము ఉన్నతము అని చెప్పినప్పుడు, నీచమైన మనుషులతో మనిషిగానున్న దూతను పోల్చి చెప్పినప్పుడు, దూతను మహోన్నతుడు అని చెప్పియుండ వచ్చును. అంతేగానీ కనిపించని దేవున్ని కనిపించే మనుషులతో పోల్చి చెప్పనవసరముండదు. ఎందుకనగా! దేవునికి మనుషులకున్నట్లు తల వుండదు, దానిలో తెలివివుండదు. అలాంటప్పుడు ఆయన అందరికంటే వివేకవంతుడని చెప్పుటకు వీలులేదు. అంతేకాక దేవుడు ఎంతటి వాడో ఎవరికీ తెలియదు. అలాంటప్పుడు మనుషులతో పోల్చి మహోన్నతుడు అని చెప్పుటకు వీలులేదు. ఏ విధముగా దేవున్ని చూడనివారు, ఆయనను ఇతరులతో పోల్చి చెప్పడమంటూ జరుగదు. అందువలన జిబ్రయేల్ దేవున్ని గురించి ఏమీ చెప్పక, అక్కడున్న దూతను గురించి మాత్రము చెప్పాడని తెలియుచున్నది. దూతను గురించి మహోన్నతుడు, వివేకవంతుడని చెప్పినమాట సరిపోవును. ఈ విధముగా ఖుర్ఆన్‌లోని వాక్యములను సరిగా అర్థము చేసుకొన్నప్పుడే అందులోని నిజమైన జ్ఞానము అర్థము కాగలదు.

జిబ్రయేల్ ఖగోళములో సృష్ట్యాదినుండి దేవుని పరిపాలనలోనున్న ఒక గ్రహము. గ్రహము అంటే ఏదో తక్కువగా లెక్కించుకోకూడదు. జిబ్రయేల్ గ్రహరూపములోనున్న సంపూర్ణజ్ఞాని అని తెలియవలెను. దేవుని పరిపాలనలోనున్న వాడు జిబ్రయేల్ కావున, ఆయనను దేవుని సేవకుడు అని అనవచ్చును. దేవుని సేవకుడు దేవుని తరపున పనిచేయువాడు కావున, ఆయనను (జిబ్రయేల్) దేవుని దూత అని కొందరనియుండ వచ్చును. అయితే ఆయనను దేవుని చేత పంపబడిన దూత అని చెప్పుకోకూడదు. జిబ్రయేల్ అటువంటిదూత కాడనీ, ఎప్పుడైనా దూత వస్తే అతను దేవుని ప్రతినిధిగా వచ్చిన కనిపించే భగవంతుడనీ తెలియవలెను. శరీరమున్న వానిని దేవుడు అని చెప్పకూడదు. కావున అట్లు వచ్చిన వానిని దూత, అవదూతయని చెప్పవచ్చును. తల్లి గర్భము నుండి (భగమునుండి) పుట్టి వచ్చినవాడు కనుక, అతనిని భగవంతుడని కూడా అంటున్నాము. దేవుడు స్వయముగా భూమిమీద అవతరిస్తే దూత, అవదూత, భగవంతుడు అని అంటున్నాము. జిబ్రయేల్ దేవుని జ్ఞాని మాత్రమేగానీ దేవుడు కాడు. అందువలన కనిపించని జిబ్రయేల్‌ను తెరవెనుక నుండి చెప్పిన వానిగా లెక్కించుచున్నాము. కనిపించి జ్ఞానము చెప్పిన కృష్ణున్ని దూతగా చెప్పుచున్నాము.

కనిపించి దైవజ్ఞానము చెప్పు దూత మనిషిగాయున్నాడు. అతనికి తలయున్నది, అందులో అమితమైన బుద్ధియున్నది. అందువలన దూతగా వచ్చిన దేవుడు సామాన్యుడుకాడని తెలిసిన జిబ్రయేల్, తనబోధలో దూతను నిశ్చయముగా ఆయన మహోన్నతుడు, వివేకవంతుడు అని అన్నాడు. ప్రపంచములో దేవుడు మొదటివాడైతే, దేవుని ప్రతినిధియైన దూత రెండవ వాడగును. కనిపించనివాడు దేవుడు, కనిపించే దేవున్ని దూత (అవదూత) అని చెప్పవచ్చును. భూమిమీద దేవునికంటే మించిన మహోన్నతుడు

ఎవడూ లేడు. కావున మహోన్నతుడు అను మాటను దేవుని దూతను గురించి చెప్పడము జరిగినది. మహోన్నతుడు, వివేకవంతుడు అని నేరుగా కనిపించని దేవున్ని గురించి చెప్పడము ధర్మవిరుద్ధమగును. అదే మాటలనే దేవుని దూత విషయములో చెప్పడము తప్పుగాదు. ఖుర్‌ఆన్ గ్రంథములో దేవుని బోధ మూడు విధముల భూమిమీద మనుషులకు తెలియబడును అని చెప్పిన ప్రకారము రెండవ విధానముగా కనిపించక తెరచాటునుండి చెప్పినవాడు జిబ్రయేల్‌యనీ, జిబ్రయేల్ దూతకాదనీ, దూత అయినవాడు మూడవ రకమైన బోధకుడగుననీ తెలియవలెను. దూతయే నిజ దైవమని తెలిసిన జిబ్రయేల్, దూతను గురించి మహోన్నతుడు, వివేకవంతుడని అన్నాడు.

**ప్రశ్న :-** ఖుర్‌ఆన్ జ్ఞానమును ముహమ్మద్ ప్రవక్తగారికి మొదట చెప్పిన జిబ్రయేల్ కనిపించనివాడైతే, ఆయనను ఏమని చెప్పాలి. ముహమ్మద్‌గారు ప్రవక్త అయినప్పుడు, జిబ్రయేల్ ఏమగును?

**జ॥** ఖుర్‌ఆన్‌ను ముహమ్మద్‌కు చెప్పిన జిబ్రయేల్‌నుగానీ, తాను విన్న ఖుర్‌ఆన్‌ను ప్రజలకు చెప్పిన ముహమ్మద్‌గారినిగానీ, ఇద్దరినీ సూత్రము ప్రకారము ప్రవక్తలనియే చెప్పాలి. అయితే జిబ్రయేల్‌గారు ఖగోళములో నున్న గ్రహము, ముహమ్మద్‌గారు భూమిమీదున్న ఒక మనిషి. జిబ్రయేల్ సృష్ట్యాదినుండి ఉన్నవాడు, సృష్ఠి ఉన్నంతకాలము ఉండువాడు. ముహమ్మద్ ప్రవక్త రాక ముందూ, ముహమ్మద్‌ప్రవక్త పోయిన తర్వాత కూడా జిబ్రయేల్ ఉన్నాడు. జిబ్రయేల్ దేవుని పాలనలోని ఒకడు. దేవుని జ్ఞానమును సంపూర్ణముగా తెలిసిన జ్ఞాని. ముహమ్మద్ ఖుర్‌ఆన్ జ్ఞానమును చెప్పుట వలన ప్రవక్త అయినా, ఆయన సాధారణ మనిషియే. మనవలె జనన మరణములు, కష్టసుఖములుగల ఒక వ్యక్తి ముహమ్మద్‌గారని తెలియవలెను.

**ప్రశ్న :-** చాలామంది ముస్లీమ్ సోదరులకు ప్రవక్త బాగా తెలియునుగానీ, జిబ్రయేల్ ఎవరో తెలియదు. ప్రవక్తకు తెలిసిన ఖుర్ఆన్ పై నుండి వచ్చిన దైవసందేశమని చెప్పుచున్నారు. దీనికి మీరేమంటారు?

**జ॥** పైనుండి వచ్చిన దైవ సందేశమును వాణి లేక వహీ అంటారు. ముహమ్మద్ ప్రవక్తగారికి వినిపించిన ఖుర్ఆన్ సందేశము అప్పుడు పై నుండి వచ్చినది కాదు. క్రింద తనకు ఎదురుగా కనిపించకయున్న జిబ్రయేల్ చెప్పినదని ఖుర్ఆన్ గ్రంథములోనే తెలియుచున్నది. పై నుండి వచ్చిన శబ్దము లేక వాణిని, దేవుడు చెప్పిన మొదటి రక జ్ఞాన ప్రచారమని తెలియవచ్చును. అయితే ఖుర్ఆన్‌లో దేవుడు 42వ సురా, 51వ ఆయత్‌లో తెల్పిన ప్రకారము దేవుని జ్ఞానము తెరచాటునుండి చెప్పబడును అను రెండవ రక జ్ఞాన ప్రచారమని తెలియుచున్నది. అందువలన ఖుర్ఆన్ గ్రంథము దేవుడు తెల్పిన రెండవ రక జ్ఞాన ప్రచారమని తెలియవలెను.

**ప్రశ్న :-** ఖుర్ఆన్ గ్రంథములో దేవుని జ్ఞానము భూమిమీద మనుషులకు మూడు విధములుగా బోధించబడునని కలదు కదా! అందులో ఒకటి వాణి (వహీ) ద్వారా చెప్పబడును అనియూ, రెండు తెరచాటునుండి చెప్పబడును అనియూ, మూడు పంపబడిన దూత ద్వారా చెప్పబడును అనియూ మూడు విధముల గలదు కదా! ఈ మూడు విధానములలో ఏ విధానము ఉత్తమమైనది?

**జ॥** దేవుని జ్ఞానము భూమిమీద మనుషులకు చెప్పబడు ఏ విధానమైనా గొప్పదే. జ్ఞానము తెలియబడడమే గొప్ప. అందువలన అన్ని విధానములు గొప్పవే అని చెప్పవచ్చును. మూడు విధానములలో ఇది గొప్ప, ఇది గొప్ప కాదు అని చెప్పుటకు వీలులేదు. బాగా ఆలోచిస్తే మొదటి విధానము వాణి ద్వారా జ్ఞానమును తెలుపడము అని ఉన్నది. వాణి అనగా శబ్దము

అని అర్థము. దేవుని జ్ఞానము శబ్దము ద్వారా వినిపించడము అని మనకు తెలిసినప్పుడు, ఆ శబ్దము ఎక్కడనుండి వస్తున్నదని ప్రశ్నించితే, శబ్దము గాలి ద్వారా వచ్చినా, అది ఆకాశమునుండి పుట్టినదని తెలియుచున్నది. దేవుని సృష్ఠిలో భూతములు, గ్రహములు, జీవరాశులు అని మూడు భాగములు కలవు. మహా భూతములు కేవలము ఐదు మాత్రమే కలవు. దేవుని నుండి మహా భూతములు మొదట పుట్టినవి. వాటి తర్వాత గ్రహములు, జీవరాసులు పుట్టినవి. మొదట పుట్టిన మహాభూతములు మొత్తము ఐదు కలవు. అవి వరుసగా 1) ఆకాశము 2) గాలి 3) అగ్ని 4) నీరు 5) భూమి. ఈ ఐదు భాగములనే ప్రకృతియని కూడా అంటున్నాము, అలాగే పంచభూతములు అంటున్నాము. దేవుని జ్ఞానము గాలి ద్వారా శబ్దరూపములో రాగా, ఆ శబ్దములోని జ్ఞానము పుట్టినది ఆకాశములోనని తెలియవలెను. ఆకాశము శూన్యమైనది, శూన్యమునుండి పుట్టిన జ్ఞానము గాలి ద్వారా శబ్దమై, మొదట సూర్య గ్రహమునకు వినిపించినది. ప్రపంచము లో మొట్టమొదట దైవజ్ఞానము సూర్యునికి తెలియగా, అదే జ్ఞానము తెలిసిన రెండవ గ్రహము జిబ్రయేల్. దైవజ్ఞానము తెలిసిన మొదటివాడు సూర్యుడు, రెండవవాడు జిబ్రయేల్ అని చెప్పవచ్చును. అయితే సూర్యుడు మొదట భూమిమీద మనువు అను వ్యక్తికి తెలియజేశాడు. మనువు ద్వారా ఇతర మనుషులకు తెలియబడినది. దీనినంతటిని గమనించితే భూతములు, గ్రహములు, మనుషులు అను మూడు జాతులలో మొదట భూతములకు తెలియబడిన జ్ఞానము తర్వాత గ్రహములకు తెలియబడగా, గ్రహముల ద్వారా భూమిమీద మనుషులకు తెలియబడినది.

ప్రకృతిలో భాగమైన ఆకాశమునుండి మొదలైన జ్ఞానము, చివరికి మనుషులకు చేరడము అంతయు ఒక జాడగా తెలియుచున్నది. ఒక

దారిగా (ఒక జాడగా) కనిపించు ఈ విధానమును రెండు భాగములుగా విభజించుకోవచ్చును. అదెలాయనగా! దేవుని నుండి మనుషులకు జ్ఞానము తెలియు మూడు విధానములలో, వాణి ద్వారా తెలియజేయడము ఒక విధానమని తెలియుచున్నది. తెరచాటునుండి తెలియజేయడము మరొక విధానమని అర్థమగుచున్నది. ఒక విధానము ద్వారా దేవుడు సృష్ఠించిన గ్రహముల గుంపుకు జ్ఞానము తెలియగా, రెండవ విధానము ద్వారా గ్రహములనుండి భూమిమీద మనుషులకు తెలియబడినది. ఆకాశమునుండి సూర్యగ్రహమునకు తెలియబడడము ఒక విధానమైతే, సూర్య గ్రహమునుండి మనుషులకు తెలియబడడము రెండవ విధానమైనది. ఆకాశములో నున్న గ్రహములు తమ స్థూలమును వదలి, సూక్ష్మముగా భూమిమీదికి వచ్చినప్పుడు, అవి ఎవరి కంటికీ కనిపించవు. ఆ విధముగా కనిపించక, మనుషులకు తెలిసిన భాషలో చెప్పడమును తెరచాటునుండి చెప్పడము అని అన్నారు. తెరచాటునుండి అనగా! చెప్పేవాడు అక్కడ ఎదురుగాయున్నా కనిపించడని అర్థము. అట్లు కనిపించకుండా మనుషులకు సూర్యుడు చెప్పాడు. అట్లే జిబ్రయేల్ కూడా చెప్పాడు. సూర్యుడు చెప్పినది భగవద్గీతయైనది. జిబ్రయేల్ చెప్పినది ఖుర్ఆన్ అయినది. ఇటు సూర్యుడు చెప్పిన జ్ఞానమునే జిబ్రయేల్ కూడా చెప్పాడు. సూర్యునకు తెలిసిన జ్ఞానమే జిబ్రయేల్‌కు కూడా తెలుసు. కావున ఇటు సూర్యుడు చెప్పినది, అటు జిబ్రయేల్ చెప్పినది రెండూ ఒకటే జ్ఞానమేనని చెప్పవచ్చును.

ముఖ్యముగా తెలియవలసినది ఏమనగా! సూర్యుడు మనువుకు చెప్పిన దినమున చెప్పబడిన జ్ఞానమునకు భగవద్గీతయని పేరు లేదు. అప్పుడది దేవుని జ్ఞానము అని మాత్రమే చెప్పబడినది. అలాగే జిబ్రయేల్ మొదట ముహమ్మద్‌కు చెప్పినప్పుడు దైవజ్ఞానమునకు ఖుర్ఆన్ అని

పేరులేదు. ఆ దినము జిబ్రయేల్ తాను చెప్పిన జ్ఞానమును దేవుని జ్ఞానముగానే చెప్పాడు. మనుషులకు తెలిసిన జ్ఞానమును గ్రంథరూపముగా వ్రాసుకొన్నప్పుడు సూర్యుడు చెప్పిన జ్ఞానమునకు భగవద్గీతయనీ, జిబ్రయేల్ చెప్పిన జ్ఞానమునకు ఖుర్ఆన్ అని పేరు పెట్టడము జరిగినది. భగవద్గీత, ఖుర్ఆన్ అను గ్రంథములు రెండూ నేడు మనముందరున్నా, రెండిటిలోనూ ఒకే జ్ఞానమును గుర్తించలేకపోవుచున్నాము. దానికి కారణము నేడు మానవునిలోనున్న సంకుచిత భావములేనని తెలియుచున్నది.

ఇంతవరకు మనము చెప్పుకొన్నవి రెండు విధానములే ఉన్నాయి. దేవుని జ్ఞానము భూమిమీద మనుషులకు తెలియు రెండు విధానములలో మహాభూతములైన ప్రకృతిపాత్ర కొంత, గ్రహముల పాత్ర కొంతయున్నట్లు అర్థమైనది. ఈ రెండు విధానములు కాకుండా మూల గ్రంథములలో మరియొక విధానము కూడా ఉన్నట్లు చెప్పారు కదా! అదియే దూతను పంపడము ద్వారా తన జ్ఞానమును తెలియజేయడమని కూడా చెప్పారు. ఇప్పుడు దూత విషయము ముఖ్యముగా మనము తెలియవలసియున్నది. దూత భూతముల ద్వారా (ప్రకృతి ద్వారా) రాలేదు. అలాగే గ్రహముల ద్వారా రాలేదు. దూత ప్రకృతిలో భూతమూకాదు, గ్రహములలో గ్రహమూ కాదు. అలాగని జీవులలో జీవుడూ కాదు. వివరముగా చెప్పుకొంటే దేవుని సృష్టిని ముఖ్యముగా మూడు భాగములుగా చెప్పవచ్చును. అవియే ఒకటి భూతములు, రెండు గ్రహములు, మూడు జీవులు. వీటిని విభజించు కొంటే భూతములు రెండు రకములు, గ్రహములు రెండు రకములు, జీవులన్ని ఒకే రకము. మొత్తము ఐదు విభజనలుగాయున్న సృష్టిని ముఖ్యముగా భూతములు, గ్రహములు, జీవులని మూడు రకములుగా చెప్పవచ్చును. అయితే దేవుని జ్ఞానము మనుషులకు తెలియదు. ముందు చెప్పుకొన్న

రెండు విధానములలో భూతముల ద్వారా గ్రహములకు ఒక విధానముకాగా, గ్రహముల ద్వారా జీవులకు రెండవ విధానమైనది. ఇప్పుడు చెప్పుకోబోవు మూడవ విధానములో ఒక్క దూత పాత్ర తప్ప భూతములపాత్రగానీ, గ్రహముల పాత్రగానీ ఏమాత్రము లేదు.

దూత ద్వారా జీవులకు దేవుని జ్ఞానము భూమిమీద ఇప్పటికే తెలియబడినది. కావున ఆ విధానమును విశ్లేషించి చూడగలిగితే, మనకు కొంత క్రొత్త విధానము అర్థమగుచున్నది. అదేమనగా! మూల గ్రంథములలో తన దూత ద్వారా జ్ఞానము చెప్పబడును అనియున్నా, ఆ దూత ఎవరు అన్నది ముఖ్యమైన ప్రశ్నగాయున్నది. దూత భూతముకాదు, గ్రహమూ కాదు. కావున మనతో ప్రత్యక్షముగా మాట్లాడిన మనలాంటి వ్యక్తియే అయివుండడము విశేషము. అయితే దూతను గుర్తించుటకు ఎవరికీ సాధ్యము కాలేదు. దూత సాధారణ మనిషియైయుండడమే దానికి ముఖ్య కారణము. దూత అను వ్యక్తి సాధారణ వ్యక్తియా కాదా అను విషయమును గురించి మనము ముందే చర్చించుకొన్నాము. దూత అనువాడు ఎవరో కాదు, రూపము మార్చుకొని వచ్చిన దేవుడేనని తేలిపోయినది. కొందరు ప్రత్యేకించి కొన్ని మతములలో దేవుడు జన్మించడు అని అంటున్నారు. మేము కూడా దేవుడు జన్మించడనియే చెప్పుచున్నాము. అయితే దేవుడు దేవుడుగా జన్మించలేదు. వేషము మార్చుకొని మారు రూపములో, మారు పేరుతో జన్మించుచున్నాడని అంటున్నాము. అలా పేరు మార్చుకొని, రూపము మార్చుకొని పుట్టాడనుటకు కొన్ని ఆధారములు గలవు. అవి ఏవనగా! భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్యా యోగమున 11వ శ్లోకమందు భగవంతుడు ఇలా చెప్పియున్నాడు.

"అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్
పరం భావమజానంతో మమ భూతమహేశ్వరమ్"

భావము :- "సర్వ జీవరాసులకు దేవుడనైన నేను మానవ శరీరము ధరించి భూమిమీదికి రాగా, మానవాకారములోనున్న నన్ను చూచిన మనుషులు నా శ్రేష్టత్వమును తెలియలేక, నేను అందరికీ అధిపతినని తెలియక మూఢులై నన్ను అవమానించుచున్నారు"

భగవద్గీత జ్ఞానయోగము॥ 6వ శ్లోకము...

"అజోపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోపి సన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా"

భావము :- "దేవునిగానున్న నాకు నాశనములేదు, అట్లే దేవునిగా నేను పుట్టను. సకల జీవరాసులకు నియామకుడను అయిన నేను, మాయతో కలిసి ఎవరూ గుర్తించని భగవంతునిగా, సాధారణ మనిషి శరీరము ధరించి పుట్టుచున్నాను."

ఈ విధముగా భగవద్గీతయందు దేవుడు భగవంతునిగా ఉన్నప్పుడు చెప్పియుండగా, పవిత్ర ఖుర్ఆన్ గ్రంథమందు 89వ సురాలో 22వ ఆయత్ నందు "దేవదూతలు బారులు తీరియుండగా నీ ప్రభువు (దేవుడు) అవతరిస్తాడు (ఏతెంచుతాడు)" అని జిబ్రయేల్ చెప్పాడు. ఈ విధముగా భగవద్గీత, ఖుర్ఆన్, బైబిల్ గ్రంథములలో దేవుడు భూమిమీదికి వస్తాడనియున్నది. భగవద్గీతలో స్పష్టముగా దేవుడనైన నేను మనిషిగా అవతరిస్తానని చెప్పడము జరిగినది. దేవుడు దేవుడుగా ఎప్పటికీ భూమిమీదికి రాడు, కానీ దేవుడు మరొక రూపముతో దూత లేక భగవంతుడు అను వానిగా వస్తాడని చెప్పవచ్చును. అప్పుడు కూడా నేను దూతననిగానీ,

భగవంతుడనని గానీ ఎక్కడా ఎవరితో చెప్పడు. దేవుడు భూమిమీద అవతరించాడను విషయము ఎవరూ పసిగట్టలేరు. అందువలన దేవుడు మనిషిగా భూమిమీదకు వచ్చి స్వయముగా జ్ఞానము చెప్పిపోయినా, ఆయన వచ్చినట్లుగానీ, పోయినట్లు గానీ ఎవరికీ తెలియదు. భగవద్గీతలో నేను ఎన్నోమార్లు వచ్చానని జ్ఞానయోగమున ఐదవ శ్లోకమందు చెప్పినా ఆ విషయమును ఎవరూ గ్రహించుకోలేక దేవుడు మనిషిగారాడని, అవతరించ డని చెప్పుచున్నారు. అటువంటి వారికొరకు భగవద్గీత రాజవిద్యా రాజగుహ్య యోగమున పదకొండవ శ్లోకమునూ, జ్ఞానయోగమున ఆరవ శ్లోకమునూ చెప్పడము జరిగినది. అంతేకాక ఆయన (దేవుడు) భూమిమీదకు ఏ పని నిమిత్తము వస్తున్నాడో ఆ పనిని వివరిస్తూ జ్ఞానయోగమున 7,8 శ్లోకములలో ఇట్లు చెప్పుచున్నాడు...

*7) శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత! ।*
*అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥*

*8) శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।*
*ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥*

భావము :- "ఎప్పుడెప్పుడు ధర్మమునకు ముప్పుకలిగి భూమిమీద అధర్మము చెలరేగునో, అప్పుడు నన్ను నేను మనిషిగా నిర్మించుకొని భూమిమీద పుట్టుచున్నాను."

" అలా మానవునిగా పుట్టిన నేను ధర్మములను తెలియజేసి అధర్మ వరుల సంఖ్యను తగ్గింతును. ఈ విధముగా ధర్మములను తెలియజేయు నిమిత్తము, యుగ యుగములో అనగా ఏ యుగములోనైనా నేను భూమిమీదికి వచ్చుచుందును."

ఇప్పుడు ఈ మాటతో భూమిమీద నేను నేరుగా మీకు జ్ఞానము చెప్పుతాననియున్నా, దూత ద్వారా జ్ఞానము తెలియజేతును అని మెలిక పెట్టి చెప్పాడు. ముందే గీతలో నేను మనిషిగా వచ్చి ధర్మములను (దేవుని జ్ఞానమును) తెలియజేతునని ఏ మెలిక లేకుండా నేరుగా చెప్పాడు. అయినా నా దూత ద్వారా దేవుని జ్ఞానమును తెలియజేస్తానని గుట్టుగా 14 వందల సంవత్సరముల క్రితము చెప్పినమాట ఎవరికీ (ముస్లీమ్‌లకు) అర్థము కాలేదు. అలాగే నేనే వచ్చి జ్ఞానమును ధర్మమును తెలియజేస్తానని రట్టుగా ఐదువేల సంవత్సరముల క్రిందట చెప్పినమాట మనుషులకు అర్థముకాక, దేవుడు భూమిమీదికి రాడు. దేవుడు ఆరు ఆకాశముల ఆవల ఏడవ ఆకాశములోయున్నాడని చెప్పుచున్నారు. ఉన్నది ఒకే ఆకాశమని తెలియని వారు స్థూలముగా ఏడు ఆకాశములు లేవని తెలియక, ఏడు ఆకాశములను సూక్ష్మఅర్థమును గ్రహించలేక, స్థూలముగానే పైన ఏడు ఆకాశములున్నా యని అంటున్నారు.

దేవుడు భూమిమీద మనుషులకు జ్ఞానమును మూడు విధముల తెలియజేస్తానని, చెప్పినమాట ప్రకారము భూతములు, గ్రహములకు వాణి ద్వారా తెలియజేయడము ఒక రకముకాగా, గ్రహములు మనుషులకు కనిపించక తెరచాటునుండి తెలియజేయడము రెండవరకమయినది. ఈ రెండు రకములను ఒక కోవకు చెందినవిగా, దేవుని పరిపాలన వలన జరుగు విధానముగా చెప్పవచ్చును. మొదటి రెండు రకములు ఒకే కోవకు చెందినవికాగా, మూడవ విధానము మాత్రము స్వయముగా దేవుడే దూతగా (భగవంతునిగా) వచ్చి చెప్పడము ప్రత్యేకత కల్గియున్నది. తన పరిపాలనలో నున్న భూతములనూ, గ్రహములనూ దేవుని సేవకులుగా, దేవుని పనిని చేయువారుగా లెక్కించి చెప్పవచ్చును. అటువంటి దేవుని సేవకులైన భూతముల, గ్రహముల కార్యము వలన, భూమిమీదికి జ్ఞానము చేరవేయ

బడుచున్నది. ఎక్కడో దూరప్రాంతములోనున్న సామాగ్రిని వాహనముల ద్వారా గమ్యస్థానమునకు చేర్చినట్లు, ప్రజలకు దూరముగా ఎక్కడోనున్న జ్ఞానమును భూతములు మరియు గ్రహముల ద్వారా మనుషుల వరకు చేరవేయడము రెండు విధములుగా ఉండగా, అట్లు రవాణా చేయకుండా మనుషులవద్దనే సామాగ్రిని తయారుచేసి ఇవ్వడము మరొక ప్రత్యేక రకముగా యున్నది. మనుషులవద్దకే దేవుడు మనిషిగా వచ్చి, అప్పటికి అవసరమైన జ్ఞానమును ప్రత్యక్షముగా అందివ్వడము ప్రత్యేక రకమని తెలియుచున్నది.

మనుషులవద్దకు దేవుని జ్ఞానము చేరునది చివరకు రెండు విధములని తెలియుచున్నది. ఒకటి కనిపించని గ్రహముల ద్వారా, రెండు కనిపించే మనిషిగాయున్న దేవుని ద్వారా అని చెప్పవచ్చును. ఈ ప్రక్రియ కొన్ని వేల సంవత్సరములకో లేక కొన్ని లక్షల సంవత్సరములకో ఒకమారు జరుగుచుండును. ఇట్లు ఒకమారు భూమిమీద తెలియబడిన జ్ఞానమును తర్వాత కాలములో కొన్ని వేల సంవత్సరముల వరకు మనుషులలో కొందరు బోధకులుగా ఏర్పడి మిగతా ప్రజలకు చెప్పుచుందురు. బోధకులు గురువుల మనుకొని చెప్పుచూపోయిన జ్ఞానము, కొంత కాలమునకు పూర్తిగా దేవుడు చెప్పిన మాటలకు అర్థమూ, భావమూ మారిపోయి ధర్మములు అధర్మములుగా మారిపోవుచున్నవి. అట్లు మారిన ధర్మములను సరి చేయుటకు దేవుడు గ్రహముల ద్వారానైనా చెప్పించవలసియుంటుంది, లేక తానే స్వయముగానైనా రావలసియుంటుంది. ఎలాగైనా దేవుడు మనిషిగా (భగవంతునిగా) వచ్చిన సమయములో, భూమిమీదయుండి ఆయన ద్వారా స్వయముగా జ్ఞానమును తెలుసుకొన్నవారు, నిజముగా అదృష్టవంతులనియే చెప్పవచ్చును. అయితే వచ్చినవాడు, చెప్పువాడు ఎవడైనదీ తెలియక తమవలెనున్న దేవున్ని కూడా, కొన్ని సమయములలో హేళన చేయడము జరుగుచున్నది. అటువంటి వారు నిజముగా దురదృష్టవంతులేనని

చెప్పవచ్చును. భూమిమీద దైవజ్ఞానము పూర్తి అజ్ఞానముతో కప్పబడి, బోధకులందరూ అధర్మములను బోధించునప్పుడు, కొన్ని సందర్భములలో దేవుడు తానే భూమిమీదికి వచ్చి తన జ్ఞానమును తెలియజేయును. అప్పుడు అంతవరకు బోధకులుగాయున్నవారికీ, అజ్ఞానమునే జ్ఞానముగా బోధించు వారికీ, ఇందూ ధర్మములను పేరుపెట్టుకొని హీనధర్మములను బోధించు బోధకులందరికీ ఒక మానవుడు, ఏ గురు పరంపర లేనివాడు, ఏ గురు పీఠమునకు సంబంధములేనివాడు వచ్చి, తమకు వ్యతిరేఖముగా జ్ఞానమును బోధించడమును ఓర్చుకోలేని వారు కొందరు, మనిషిగా వచ్చిన వానికి వ్యతిరేఖముగా మాట్లాడడమూ, వేధించడమ జరుగుచుండును. అటువంటి వారిని గూర్చియే నా శ్రేష్టత్వమును తెలియని మూఢులు నన్ను అవమానింతు రని భగవద్గీత రాజవిద్యా రాజగుహ్యా యోగమున పదకొండవ శ్లోకమందు చెప్పాడు. దేవుడు స్వయముగా భూమిమీదికి వచ్చినా, వచ్చినట్లు ఏ ఆధారమూ దొరకదు. అందువలన చాలామంది పొరబడుటకు అవకాశము కలదు. అటువంటి పొరపాటు పడకుండ మనిషిగా వచ్చినవాడు, మనిషి కాకున్నా మనిషిగాయున్నవాడు తెలుపు జ్ఞానమును శ్రద్ధగా గ్రహించిన వారు ధన్యులగుదురు. అటువంటి మంచికాలములో ఆయనతో మాట్లాడిన వారు, ఆయన సేవలో పాల్గొన్నవారు, ఆయనను చూచినవారు, వారికి తెలియకుండానే వారు అదృష్టమును పొందినవారని చెప్పవచ్చును. ఎన్నో కోట్లమందిలో తమకు మాత్రము అటువంటి అవకాశము లభించినందుకు వారు పూర్తి అదృష్టవంతులే. అయినా ఆ విషయము తెలియుటకు ఎవరికీ అవకాశము లేదు. అయితే దేవుని జన్మను తెలిసి తాను ఎంతో అదృష్ట వంతుడనని అనుకొన్నవాడు, అతని చేతిలో తన చావును కోరుకొన్నవాడు, చనిపోవునప్పుడు కూడా ఆయననే చూడాలని అడిగినవాడు, నీవు నాకు మోక్షమును ప్రసాదించమని నేరుగా మారువేషములోనున్న దేవున్ని కోరిన వాడు చరిత్రలో ఒకేఒక భీష్ముడు కలడని మరచిపోకూడదు.

ఇటువంటి ప్రత్యేకతలను కల్గియున్నటువంటి దూతద్వారా జ్ఞానము చెప్పిస్తానని దేవుడు చెప్పిన విధానమును గొప్పదిగా చెప్పవచ్చును. దూత అను పదమును సేవ చేయువారిపట్ల, తమ కార్యములను చేయువారిపట్ల, తన సందేశమును తీసుకొనిపోయి ఇతరులకు చేర్చివచ్చువారిపట్ల వాడుచుండుట వలన, ఇక్కడ జ్ఞానమును చెప్పు దూతను కూడా ఒక కార్యము చేయు పనిమనిషిగా కొందరు లెక్కించుకొనుచున్నారు. అట్లు పొరబడకుండా దూత అంటే ఏ దూతగాయున్నాడో అర్థము చేసుకోవాలి. 89వ సురా 22వ ఆయత్‌లో దేవదూతలు బారులు తీరియుండగా నీ ప్రభువు అవతరిస్తాడు అని ఉన్నది కదా! అక్కడ దూతలను ఆయన సేవకులుగా లెక్కించాలి. ఇట్లు సందర్భానుసారము భావించాలి.

**ప్రశ్న :-** ఒకే దేవుని జ్ఞానమునే ఐదువేల సంవత్సరముల పూర్వము గీతగా, పదునాలుగువందల సంవత్సరముల పూర్వము ఖుర్‌ఆన్‌గా చెప్పబడినప్పుడు రెండిటిలో ఒకే జ్ఞానముండవలయును కదా! అట్లు కాకుండా గీతను ఆశ్రయించిన హిందువులు ఒక విధముగా జ్ఞానమును అర్థము చేసుకోగా, ఖుర్‌ఆన్‌ను ఆశ్రయించిన ముస్లీమ్‌లు అదే జ్ఞానమునే మరొకరకముగా చెప్పుకొనుచున్నారు. దేవుడు ఒకడే అయినప్పుడు, జ్ఞానము ఒకటే అయినప్పుడు, మనుషులందరూ ఒకే జాతియైనప్పుడు, ఒకే జ్ఞానము వేరువేరుగా మనుషులకు ఎందుకు అర్థమైనది. ఒకే భావముతో ఎందుకు అర్థము కాలేదు?

**జ॥** దేవుడు ఒక్కడే, దేవుని జ్ఞానము ఒక్కటే అయినా, మనుషులంతా ఒకటేనను భావము మనుషులలోనే లేదు. మనుషులను మాయ ఆవహించి, అజ్ఞానమును వారిలో పెంచి, మతము అను అస్త్రమును ప్రయోగించి, మీరు ముస్లీమ్‌లు మేము హిందువులము అను భావమును హిందువుల

లోనూ, మీరు హిందువులు మేము ముస్లీమ్‌లము అను భావము ముస్లీమ్‌లలోను కల్గించి ఉండుట వలన, వారి వర్గ బేధము జ్ఞానమును కూడా వేరువేరుగా అర్థమగునట్లు చేసినది. అట్లని ఒకరికి సక్రమముగా అర్థమై, మరొకరికి సక్రమముగా అర్థము కాలేదని మేము చెప్పడము లేదు. వారివారి ధ్యాసలు వారివారి మతముల మీద ఉండుట వలన, మత ధ్యాసయున్న ఎవరికిగానీ, మతాతీతముగాయున్న దేవుని జ్ఞానము అర్థము కాలేదు. భగవద్గీత సంపూర్ణముగా దేవుడు చెప్పిన భావముతో హిందువులకు అర్థము కాకపోగా, అట్లే ఖుర్ఆన్ గ్రంథములో చెప్పబడిన జ్ఞానము సంపూర్ణముగా ముస్లీమ్‌లకు కూడా అర్థముకాలేదు. వారివారి మతమును అనుసరించిన భావములను ఇరువురు చెప్పుకొనుచుండుట వలన, అసలైన భావము మరుగునపడిపోయి, రెండు ప్రక్కల రెండు వర్గముల వారికి జ్ఞానము అర్థము కాకుండా పోయినది. మా మాట నిజమని తెలియుటకు ఉదాహరణగా రెండు గ్రంథములలోనున్న ఒకే విషయమును తీసుకొని ఇరువర్గముల వారికి ఎలా అర్థమైనదో చూద్దాము.

దేవుడు ఆత్మస్వరూపుడు, సృష్ఠికి పూర్వము ఏకముగాయున్న దేవుడు సృష్ఠి తర్వాత మూడు ఆత్మలుగా విడిపోయాడు. తన సృష్ఠినంతటినీ ఎక్కువగా మూడు సంఖ్యతోనే ముడివేశాడు. మూడు ఆత్మలుగా విభజించి మూడవ ఆత్మయిన పరమాత్మగా తానువుంటూ తన శక్తిని నింపిన ఆత్మను రెండవ దానిగా, కర్మను తగిలించిన ఆత్మగా మొదటి జీవాత్మను ఉంచాడు. జీవాత్మ, ఆత్మ, పరమాత్మయని వరుసగా చెప్పబడు మూడు ఆత్మలు మినహా, ప్రపంచములో ఉన్నదంతా ఆత్మల స్వరూపముకాని ప్రకృతియని తెలియవలెను. ప్రకృతి మనిషిలో మూడు గుణములుగాయుంటూ, మిగత ప్రపంచమంతా నిండియున్నది. ప్రపంచములో మూడు ఆత్మలు కాకుండ మిగిలిన

సమస్తమును ప్రకృతియని చెప్పవచ్చును. ప్రకృతియైన సమస్త వస్తు జాలమును మూడవ ఆత్మ అయిన పరమాత్మ ఆవహించి అణువణువున వ్యాపించియున్నది. ఈ విధముగా సృష్ఠియంతయు పరమాత్మ వ్యాపించి యున్నది. మిగత జీవాత్మ, ఆత్మలలో కూడా పరమాత్మ వ్యాపించియున్నదని చెప్పవచ్చును.

పరమాత్మకు, ఆత్మకు, జీవాత్మకు గణితశాస్త్రములో సంఖ్యలను కేటాయించడము జరిగినది. జ్ఞానులైన పెద్దలు ఎంతో యోచించి జీవాత్మకు మూడు (3) సంఖ్యనూ, ఆత్మకు (6) సంఖ్యనూ, పరమాత్మకు తొమ్మిది (9) సంఖ్యను గుర్తుగాయుంచుకొన్నారు. 3 6 9 అనగా జీవాత్మ, ఆత్మ, పరమాత్మ యను మూడు ఆత్మలని అర్థమగునట్లు చేశారు. ఒకవేళ 9 6 3 అని చెప్పినా పరమాత్మ, ఆత్మ, జీవాత్మయని అర్థమగునట్లు చేశారు. ఈ సంఖ్యలను ఎలా గుర్తించినదీ, ఏ పద్ధతిని అనుసరించి గుర్తించినదీ మా రచనలలోని **"హేతువాదము-ప్రతివాదము"** అను గ్రంథములో కలదు. ఆ విధముగా సంఖ్యలను గుర్తించునట్లు చేసినది దేవుడేనని, దేవునికి తెలియకుండ, దేవుని ఆజ్ఞ లేకుండా ఏమీ జరుగదని జ్ఞాపకముంచు కోవలెను. సృష్ఠియంతయు మూడు ఆత్మలు ఒక ప్రకృతి నిండియున్నది. ప్రకృతిని కూడా మొదట దేవుడు తననుండే సృష్ఠించాడు. సంఖ్యలలో పెద్ద సంఖ్య ఎప్పటికీ విలువ మారని సంఖ్య తొమ్మిదిగా వుండుట వలన తొమ్మిదిని పరమాత్మగా గుర్తించడము జరిగినది. పరమాత్మ ఆత్మకంటే వేరుగాయున్నాడు. కావున పరమ+ఆత్మ=పరమాత్మయని పిలువబడు చున్నాడు. పరమాత్మ అనునది అర్థమును తెలుపు పదమేగానీ పేరుకాదు. అలాగే దేవుడు అనగా దేవులాడ (వెతుకులాడ) బడేవాడని అర్థముగానీ అది పేరు కాదు. ఈ విధముగా దేవునికి పేరు ఏమాత్రము లేదు. పేరు లేని దేవుడు ప్రత్యేకముగా ఉన్నాడు. పేరున్న ఆత్మ, జీవాత్మలు రెండు

ఒకేచోట, ఒకే శరీరములో కలిసియున్నవి. అందువలన ఈ రెండు ఆత్మలను జోడు ఆత్మలని అంటాము. పరమాత్మ ప్రపంచమంతా అణువణువున వ్యాపించియుండగా, జీవాత్మ ఆత్మలు ఒక శరీరమును ఆశ్రయించి ఉన్నాయి. అలాయున్న రెండు ఆత్మలలో జీవాత్మ ఏమీ చేయలేనిదిగా, శరీరములో ఒక్కచోట మాత్రమున్నది. అయితే రెండవదైన ఆత్మ శరీరమంతా వ్యాపించి, శరీరమునకు శక్తినిచ్చి కదిలించి పని చేయిస్తూ నడిపించుచున్నది. ఆత్మ చేయగా జరిగిన పనిలో ఉన్న కష్ట సుఖములను జీవుడు అనుభవించడము తప్ప, వేరు పనంటూ ఏదీ జీవునకు లేదు. శరీరములో కూడా దేవుడైన పరమాత్మ అణువణువున వ్యాపించియుండగా, ఆత్మ శరీరమంతా వ్యాపించి యున్నది. జీవుడు ఒక్కచోట రవ్వంతగాయున్నాడు. దేవుడు (పరమాత్మ) శరీరము లోపల, శరీరము బయట సృష్టి అంతట వ్యాపించియుండగా, ఆత్మ కేవలము శరీరములలో మాత్రము వ్యాపించి యుండగా, జీవాత్మ శరీరములో ఒక్కచోట సూదిమోపినంత జాగాలో రవ్వంతగాయున్నది. జీవునికి శరీరములో కర్మను అనుభవించడము తప్ప వేరు పనంటూ ఏమీ లేదు. అలాగే పనిలేనివాడు దేవుడు. దేవుడు సర్వప్రపంచము వ్యాపించియుండి సాక్షిగా అంతటినీ చూస్తున్నాడు తప్ప ఏ కార్యమును చేయలేదు. అందువలన దేవున్ని రూప, నామ, క్రియలు లేనివాడని చెప్పవచ్చును.

జీవాత్మ, పరమాత్మ (జీవుడు,దేవుడు) ఇద్దరూ పని లేనివారుకాగా, మధ్యలోనున్న ఆత్మ మాత్రము ఒక్క క్షణము కూడ ఊరక ఉండకుండ శరీరములో ఎల్లకాలము పని చేయుచున్నది. మెలుకువ, స్వప్నము, నిద్ర అను మూడు స్థితులలో ఆత్మ పని చేయుచునేయున్నది. నిద్రలో కూడా శ్వాసను ఆడించుట, జీర్ణము చేయుట మొదలగు శరీర కార్యములను

ఎన్నిటినో చేయుచూ క్షణకాలము కూడ ఊరకయుండలేదు. శరీరములో జీవుడు చేయకున్ననూ అన్ని కార్యములను ఆత్మే చేయుచూ జన్మనుండి మరణము వరకు, నిద్రనుండి మెలుకువ వరకు, అట్లే మరణమునుండి జన్మ వరకు, మెలుకువ నుండి నిద్రవరకు జీవున్ని నడిపించి అన్నిటినీ బలవంతముగా అనుభవింపజేయుచున్నది. ఈ విధముగా ఆత్మ జీవుని వెంటవుండి నడిపించుచున్నది. ప్రపంచములో ఏ శరీరము ఎట్లు నడుస్తున్నదీ, ఆత్మ ఎట్లు నడిపిస్తున్నదీ, జీవుడు అన్నీ అనుభవిస్తూ ఏ భావముతోయున్నదీ, అన్నిటినీ దేవుడు ప్రతి శరీరములోనూ గమనించు చున్నాడు. అందువలన గీతలో దేవుడు సాక్షిగాయున్నాడని అర్థమగునట్లు చెప్పబడినది. శరీరములో జీవుడు గ్రుడ్డివాడు, చెవిటివాడు, కుంటివాడు, మూగవాడు మొత్తము కదలని మెదలని అవిటివాడుగాయుండగా, శరీరము నకు పెద్దయై శరీరమంతటా వ్యాపించియున్న ఆత్మ శరీరమునకున్న అవయవములను ఉపయోగించుకొని శరీరమును అందులోని జీవున్ని నడుపుచున్నది. శరీరమునకు అధిపతి, అధికారి ఆత్మకాగా జీవాత్మ, ఆత్మ అందించు సమాచారముతో బ్రతుకుతున్నది. ఆత్మను, జీవాత్మను చూస్తున్న వాడు దేవుడు (పరమాత్మ).

ఈ విధముగా సృష్ఠిలోని సర్వ జీవరాసుల శరీరములలో జీవాత్మ ఆత్మలు జోడు ఆత్మలుగా ఉండగా, వాటితో ఎలాంటి సంబంధము లేకుండా, ఏ సలహా ఇవ్వకుండ కేవలము సాక్షిగా పరమాత్మ కలదని తెలిసిపోయినది కదా! ఇదే విధానమునే తెలుపునట్లు దేవుడు ప్రతి మనిషి హస్తములోనూ మూడు ఆత్మల గుర్తుగా మూడు రేఖలను ఉంచాడు. అరచేతిలో క్రిందగల రెండు రేఖలు ఒక చివరిలో ఒకదానితో ఒకటి కలిసియున్నవి. అలా కలిసియున్నట్లు రెండు జోడు రేఖలను జీవాత్మ ఆత్మలుగా పెద్దలు గుర్తించారు.

క్రింద మొదలైన క్రిందిరేఖ జీవాత్మగానూ, ప్రక్కన మొదలైన లేక మొదటి దానికంటే పైనున్న రేఖ ఆత్మగానూ లెక్కించబడుచున్నది. ఈ రెండు రేఖలు బొటన వేలికి పై భాగమున ఒకదానితో ఒకటి కలిసి లేక దగ్గరగాయుండి జోడు ఆత్మలుగా పేరుగాంచినవి. ఈ రెండు రేఖలకంటే పైన ప్రత్యేకముగాయున్న ఒక రేఖ దేనితో కలియకుండ ఉండడము విశేషము. అట్లు విశేషముగాయున్న మూడవరేఖయే శరీరములోని పరమాత్మగా చెప్పబడుచున్నది. శరీరమునందు కార్యములు చేయు కర్మేంద్రియములలో ముఖ్యమైనది హస్తము. హస్తములో (అరచేతినందు) మూడు రేఖలు మూడు ఆత్మలకు గుర్తుగాయుండుట వలన, పూర్వము ఉదయము నిద్ర లేస్తూనే ఎవరి ముఖము చూడకుండ, తన హస్తమును చూచుకోమని పెద్దలు చెప్పి, చాలామందికి అలా చూచుకోవడమును అలవాటు చేశారు. మేము చిన్న వయస్సులో ఉన్నప్పుడు కూడా ఉదయము నిద్రనుండి లేస్తూనే అరచేయిని చూచుకొనువారిని చాలామందిని చూచాము. ఎందుకలా చేయుచున్నారని కూడా కొందరిని అడిగాము. అయితే వారు ఆ రోజు సరైన సమాధానము చెప్పలేదు. మొదట తన చేతులను చూచుకోవడము ద్వారా తర్వాత ఇతరులను చూచినా, వారి వలన కలుగు చెడు పోతుందని చెప్పారు. అప్పటికదే నిజమని నమ్మాము. ఈ రోజు అది అసత్యమని తెలిసినది. ఉదయము ముందుగా హస్తములోని మూడు రేఖలను చూచుట ద్వారా తాను జీవాత్మననీ, తనను ఆత్మ నడిపిస్తున్నదనీ, పరమాత్మ అన్నిటినీ గమనించు సాక్షిగాయున్నాడను జ్ఞానము జ్ఞాపకము రాగలదనీ, దేవుడు గుర్తు వచ్చునట్లు పెద్దలు అలా చేతులను చూచుకొమ్మని చెప్పియుండగా, కొంత కాలమునకు దాని వివరము మరచిపోయి చివరకు అర్థము పోయి మనుషులవద్ద కార్యాచరణ ఒకటి మిగిలినది. ఇప్పటి కాలములో చేతులను చూచుకొను కార్యాచరణ కూడా పోయినది.

శరీరములోని ఐదు కర్మేంద్రియములలో హస్తము ప్రధానమైనది. అందువలన మూడు ఆత్మల గుర్తును మూడు రేఖలుగా హస్తమునందు దేవుడుంచి చూపించాడు. అలాగే "జ్ఞానేంద్రియానాం నయనం ప్రధానమ్" అన్నట్లు ఐదు జ్ఞానేంద్రియములలో కన్ను ప్రధానమైనది. అందువలన హస్తములోవలె కన్నులో కూడా మూడు ఆత్మల గుర్తును దేవుడుంచాడు. కంటిలో కనుగ్రుడ్డును పరిశీలించి చూచితే మొదట తెల్లకన్ను, తెల్లకన్నులో నల్లకన్ను, నల్లకన్నులో పూర్తి చిన్నదిగాయుండి కనుపాప అను పేరుతో పెసరగింజంత లేక ఆవగింజంత నల్లకన్ను ఉండును. మొదట తెల్లగా యుండు తెల్ల కన్నును పరమాత్మగా, దాని తర్వాత తెల్లకన్ను మధ్యలో గుండ్రముగా నల్లగా అర్ధ అంగుళమునకు తక్కువ విస్తీర్ణముగల నల్లగ్రుడ్డును ఆత్మగా, నల్లగ్రుడ్డు మధ్యలో ఆవగింజంత నలుపుగల చిన్న గుండ్రని భాగమును జీవాత్మగా పెద్దలు లెక్కించి జ్ఞానము తెలియనివారికి చూపించి నీ కన్నులో జీవాత్మ, ఆత్మ, పరమాత్మల గుర్తుకలదనీ, ప్రతి దినము వీలున్నప్పుడు, అద్దము చూచుకొన్నప్పుడు చూపులో చూపును పెట్టిచూడు అని చెప్పారు. మరికొందరు జ్ఞానులు రూపును చూపును ఏకముగా చూడమని చెప్పారు. ఈ విధముగా నీ చూపుతో నీ కన్నును చూడమనీ, అలా చూచుట వలన దేవుడు, జీవుడు, మధ్యలో ఆత్మకలదని తెలియునని చెప్పారు. అలా పెద్దలు చెప్పడము వలన పూర్వము తన కన్నును తానే అద్దమునందు చూచుట చేసెడివారు. అద్దము లేని కాలములో ఎదురుగా నున్న మనిషి కంటిలోనికి నేరుగా చూచెడివారు. దానినే పూర్వము చూపులో చూపునుంచి చూడడము అనెడివారు. ఈ విధముగా శరీరములోని మూడు ఆత్మలను కర్మేంద్రియమైన హస్తములోనూ, జ్ఞానేంద్రియమైన కన్ను లోనూ పెద్దలు గుర్తించి చూపారు. ప్రస్తుత కాలములో మనుషులందరూ హస్తమునూ, కన్నునూ కల్గియున్నా వాటిలోనున్న మూడు గుర్తులను తెలియక యున్నారు.

ప్రతి శరీరములోనూ మూడు ఆత్మలున్నవని అందులో నడిపింప బడే జీవాత్మ ఒకటని, నడిపించే ఆత్మ రెండవదనీ, రెండిటినీ చూస్తూ ఊరక యుండు పరమాత్మ మూడవదనీ ఆధ్యాత్మిక విద్యలో ముఖ్యముగా తెలియ బడుచున్నది. ఇదే మూడు ఆత్మల విషయమునే బ్రహ్మవిద్యా శాస్త్రములైన భగవద్గీతయందూ, ఖుర్ఆన్ గ్రంథమునందు చెప్పబడినది. భగవంతుడైన శ్రీకృష్ణుడు చెప్పిన భగవద్గీతయందు పురుషోత్తమ ప్రాప్తియోగమున 16,17 శ్లోకములందు మూడు ఆత్మలను ముగ్గురు పురుషులుగా పోల్చి చెప్పడమైనది.

*16 శ్లో॥* *ద్వావిమౌ పురుషౌలోకే క్షరశ్చాక్షర ఏవ చ ।*
*క్షర స్సర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే ॥*

*17 శ్లో॥* *ఉత్తమ: పురుషస్త్వన్య: పరమాత్మేత్యుదాహృత:*
*యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వర:*

భావము :- "లోకములో రెండు రకముల పురుషులు (ఆత్మలు) ఉన్నారు. వారిని క్షరుడు, అక్షరుడని చెప్పుచున్నాము. క్షరుడు అనబడువాడు సర్వ జీవరాసుల శరీరములలో కలడు. అక్షరుడనువాడు క్షరునితో కలిసి అదే శరీరమునందు నివసించుచున్నాడు." "క్షరుడు అక్షరుడు అను ఇద్దరు పురుషులకంటే వేరొక పురుషుడు కలడు. మూడవ పురుషుడు క్షరునికంటే మరియు అక్షరునికంటే ఉత్తముడు. అందువలన అతను పురుషోత్తముడనీ, పరమాత్మయనీ పిలువబడుచున్నాడు. మూడవ ఆత్మయిన పరమాత్మయే ముల్లోకములు అణువణువున వ్యాపించి ఈశ్వరుడని పిలువబడుచున్నాడు."

ఈ విధముగా మూడు ఆత్మలను గురించీ భగవద్గీత బోధించు చుండగా, ఖుర్ఆన్ గ్రంథములో 50వ సురాలో 17, 18, 21వ ఆయత్ లందు ఇలా చెప్పబడినది (17) ప్రతి వ్యక్తి దగ్గర ఇద్దరుంటారు. ఒకరు

కుడి ప్రక్కన; మరొకరు ఎడమ ప్రక్కన గలరు. (18) నోటిమాట వెలువడక ముందే అతని వద్దయున్న పర్యవేక్షకుడు దానిని నమోదు చేసి భద్రపరచ టానికి సిద్ధంగా ఉంటాడు. (21) ప్రతి వ్యక్తీ ఒక తోలేవాడితో, ఒక సాక్ష్యమిచ్చే వాడితో సహా హాజరవుతాడు.

17వ వాక్యములో ప్రతి వ్యక్తిలో ముగ్గురున్నట్లు తెలియుచున్నది. 18వ వాక్యములో వారిలో జీవుడు ఏ తప్పుచేసినా వానిని నమోదు చేసుకొను పర్యవేక్షకుడు ఒకడున్నాడని చెప్పడము వలన ఆ పర్యవేక్షకుడే అన్ని పనులు చేయు ఆత్మయని తెలియుచున్నది. మరొకరయిన పరమాత్మ ఏమీ చేయని వాడని తెలియుచున్నది. 21వ వాక్యములో ప్రతి వ్యక్తీ (ప్రతి జీవుడు) ఒక తోలేవాడితో (ఒక నడిపే ఆత్మతో) ఒక సాక్ష్యమిచ్చేవాడితో (ఒక పరమాత్మతో) హాజరవుతాడు (భూమిమీద జన్మిస్తాడు) అని కలదు. దీనినంతటినీ గమనించితే, భగవద్గీతలో చెప్పినట్లు ఒక శరీరములో మూడు ఆత్మలు కలవని చెప్పడమే ముఖ్య ఉద్దేశ్యమని తెలియుచున్నది. ప్రతి శరీరమును నడిపేవాడు ఆత్మని, సాక్షిగాయున్నవాడు పరమాత్మని ముందే చెప్పుకొన్నాము. ఏదో ఒక విధముగా సురా 50లో 17, 18, 21 వాక్యములలో మూడు ఆత్మలను గురించి చెప్పియుండగా, దానిని ముస్లీమ్‌లు ఏమాత్రము అర్థము చేసుకోకుండా మరియొక రకముగా అర్థము చేసు కోవడము ఆశ్చర్యము. అలాగే హిందువులైన వారిలో స్వాములు, గురువులైన వారికి కూడా మూడు ఆత్మల విషయము అర్థము కాకపోవడము మరీ ఆశ్చర్యము. మేము గీతలో చెప్పిన ముగ్గురు పురుషులను (మూడు ఆత్మలను) గురించి చెప్పుచూ త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించితే, క్రైస్తవులలోని త్రిత్వమును (త్రినిటిని) బోధిస్తున్నామని హిందువులైన వారే మమ్ములను క్రైస్తవులుగా ఆరోపణ చేయడము విడ్డూరము.

సృష్ట్యాదిలో దేవుడు మహాభూతమైన ఆకాశము ద్వారా శబ్ద రూపముతో తెల్పిన జ్ఞానమును ఆదిలోనే సూర్యుడు మనువుకు తెల్పగా, అదే జ్ఞానమునే ఐదువేల సంవత్సరముల పూర్వము భగవంతుడు అర్జునునికి తెల్పాడు. ఈ విధముగా భారతదేశములో దేవుని జ్ఞానము తెలియబడగా, అదే దేవుని జ్ఞానమే జిబ్రయేల్ ద్వారా ముహమ్మద్ ప్రవక్తకు చెప్పబడినది. ఒకే దేవుని జ్ఞానము చెప్పబడుట చేత అదే జ్ఞానమే భగవద్గీత పురుషోత్తమ ప్రాప్తి యోగమున 16, 17 శ్లోకములలో ముగ్గురు పురుషులుగా చెప్పబడగా, ముగ్గురు పురుషుల జ్ఞానమే ఖురాన్‌లో 50వ సురాయందు 17, 18, 21 ఆయత్‌లలో చెప్పుచూ, ప్రతి మనిషివద్ద ఒకడు పాపమును వ్రాసుకొను వానిగా, మరియొకడు సాక్షిగాయున్నట్లు చెప్పారు. అయినా సృష్ట్యాదినుండి దేవుడు ఫలానా ముగ్గురు పురుషుల గురించి (మూడు ఆత్మల గురించి) చెప్పుచున్నాడని ఇటు హిందువులుగానీ, అటు ముస్లీమ్‌లుగానీ తెలియలేక పోయారు. ఈ విషయము చివరికి క్రైస్తవులకు కూడా తెలియకుండా పోయినది. త్రిత్వమని వారి సమాజములో ఉన్నా వారు దేవుని జ్ఞానమునకు వేరుగా చెప్పుకొన్నారు. వారు చెప్పుకొన్న త్రిత్వము దేవుడు చెప్పిన మూడు ఆత్మలకు సంబంధము లేదు. తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మయని వారు చెప్పినా తండ్రి, పరిశుద్ధాత్మ ఇద్దరూ ఒక్కరేయగుట వలన అది ద్విత్వమే యగును. వారి బోధలో ముగ్గురు పురుషులనిగానీ, మూడు ఆత్మలను భావము గానీ ఎక్కడాలేదు. మొత్తము మీద ప్రపంచములోనే మూడు ఆత్మల జ్ఞానము తెలియకుండా పోయినది.

సృష్ట్యాదినుండి ఒకే జ్ఞానముండగా, మధ్యలో మతములు వచ్చి వేరువేరు జ్ఞానము, వేరువేరు దేవుడు అన్నట్లు చేసినందున మేము నిజమైన దైవ భక్తులమని కొందరనుచుండగా, మాదే నిజమైన మతము, మాదే నిజమైన జ్ఞానమని మరికొందరంటున్నారు. మత బేధములు వచ్చి చివరకు

దేవుడు చెప్పిన జ్ఞానమును మరచిపోయి, వారివారి స్వంత జ్ఞానమును దేవుని జ్ఞానముగా చెప్పుకొంటున్నారు. లేని నరక స్వర్గములను కల్పించుకొని ఎక్కడో స్వర్గమున్నది, ఎక్కడో నరకమున్నదని భ్రమించుచున్నారు. దేవుడు చెప్పని స్వర్గ, నరకములను మనిషి ఊహించుకొనుచున్నాడు. దేవుడు చెప్పిన స్వర్గ, నరకములు ఇక్కడే ప్రత్యక్షముగా ఉన్నా తెలియలేక పోవుచున్నాడు. స్వర్గమూ, నరకమూ ఎదురుగాయున్నా గ్రహించలేని గ్రుడ్డివానిగా మనిషి మారిపోయాడు. దేవుని జ్ఞానమును దాని ప్రత్యేకతను తెలియకపోవడమే కాక, దేవుడు దిగివచ్చి చెప్పినా, చెప్పేవాడు నాలాంటి మనిషియని హేళన చేసి, అతను చెప్పినదానికంటే నాకు తెలిసినదే గొప్పయనుకొంటున్నాడు. అందువలన అసలైన జ్ఞానము అన్ని మతములలోనూ కరువైపోయినదని చెప్పవచ్చును. ఇటువంటి పరిస్థితి ఏర్పడినప్పుడు దేవుడు తిరిగి తన జ్ఞానమును పునరుద్ధరించును. అలా పునరుద్ధరించుటకు మరొకమారు తెరచాటునుండి తన సేవకులైన (దూతలైన) గ్రహముల ద్వారానైనా చెప్పించును. లేకపోతే తానే స్వయముగా వేషము మార్చుకొని మానవునిగా వచ్చి ఎక్కడో ఒకచోట తన జ్ఞానమును చెప్పిపోవును. అలా చెప్పబోవు జ్ఞానమే ఈనాడు భూమిమీదగల అన్ని మతములకు సరియైన జ్ఞానమగును. ఎవరికీ తెలియకుండావచ్చి ఎక్కడో ఒకచోట చెప్పబడు జ్ఞానమే సర్వ ప్రపంచమునకు దారి చూపగలదు. కొందరు దేవుని జ్ఞానమును తొందరగా గ్రహించినా, గ్రహించనివారు చాలామందియుండినా, చివరకు వారందరూ ఒకే దారిలోనికి వచ్చి ఒకే జ్ఞానమును విశ్వసింపవలసివస్తుంది. క్రొత్తగా చెప్పబడిన దేవుని జ్ఞానమును ఎవడైనా ఈ జన్మలో ఒప్పుకోకపోయినా, తర్వాత జన్మలోనైనా వేరుదారిలేక ఒప్పుకొనితీరును. మతములుగా చీలిపోయి వేరువేరు జ్ఞానులుగా విభజింపబడిన వారందరు ఒకే జ్ఞానమును ఆశ్రయించబోవు కాలము వస్తుందని అనుకొంటున్నాను.

**ప్రశ్న :-** భూమిమీద ధర్మములు అధర్మములుగా మారినప్పుడు, మాయ ప్రభావమువలన అజ్ఞానము జ్ఞానముగా చలామణి అగుచున్నప్పుడు నేను అవతరించి అసలైన దైవ ధర్మములను జ్ఞానరూపములో తెలియజేస్తానని చెప్పాడు కదా! అటువంటి పరిస్థితి ఇప్పుడు ఏర్పడిందంటారా? దేవుడే భగవంతునిగా వచ్చి చెప్పిన భగవద్గీత ఉండగా, అలాగే బైబిలు గ్రంథముండగా, మహాజ్ఞాని జిబ్రాయేల్ చెప్పిన ఖుర్ఆన్ గ్రంథముండగా, అవన్నియు దేవుని జ్ఞానమునే దేవుని ధర్మములనే బోధిస్తుండగా మరియొక మారు దేవుడు వచ్చి జ్ఞానము చెప్పునను మీ మాట సరియైనదేనా?

**జ॥** దేవుడు చెప్పిన గీతలోనూ, మిగత గ్రంథములలోనూ దేవుని ధర్మములు లేవని నేను చెప్పడములేదు. దేవుడు సృష్ట్యాదిలోనే ధర్మములను చెప్పి ప్రతిష్ఠించాడు. అయితే ఉన్న ధర్మములు తెలియకుండ పోయి వాటి స్థానములో అధర్మములు వృద్ధి చెందినప్పుడు, తిరిగి తన ధర్మములను తెలుపు నిమిత్తము, అధర్మములను లేకుండా చేయు నిమిత్తము దేవుడు వస్తానని చెప్పాడు. అంతేగానీ తన ధర్మములను బోధించు గ్రంథములు లేవని ఆయన కూడా చెప్పలేదు. ఆయన గ్రంథములున్నా, ఆ గ్రంథములలోని ధర్మములు మనుషులకు తెలియకుండాపోయి, వాటి స్థానములో అధర్మములు ధర్మములుగా చలామణి అగుచున్నప్పుడు వస్తానని చెప్పాడు. దేవుడు ఈమారు తిరిగివస్తే ఇంతకు ముందు చెప్పిన ధర్మములనే తెలియజేస్తూ అప్పుడు చెప్పక వదలివేసిన వాటిని కూడా తెలియజేస్తాడు. బైబిలు గ్రంథములో కూడా ఇదే విషయమును చెప్పుచూ ఆదరణకర్తగా వచ్చువాడు ఇప్పుడున్న జ్ఞానమునేకాక ఇంకా చెప్పక వదిలివేసిన సమస్త జ్ఞానమును తెలియజేయునని యోహాన్ సువార్త 16 అధ్యాయములో 12, 13, 14 వాక్యములందు చెప్పియున్నారు. ఆ మాట ప్రకారము రాబోవు

దేవుడు ఎప్పుడు వచ్చినా ముందు గ్రంథములలోని విషయములనేకాక ఇంకా అప్పుడు చెప్పని వాటిని కూడా చెప్పిపోవును. అప్పుడు సమస్త జనులు అన్ని మతములవారు ఏక జ్ఞానములోనికి రాక తప్పదు. ఇది జరుగబోవు సత్యము.

**ప్రశ్న :-** మీరు ఎప్పుడో జరుగబోవు విషయమును చెప్పుచున్నారు. ఒకవేళ అటువంటి సమయమొస్తే, అందరూ ఏక జ్ఞానములోనికి వస్తే, అంతకంటే మంచికాలము మరియొకటి ఉండదు. అయితే కొన్ని మతములలో ఇదే ఆఖరి బోధయని చెప్పుచున్నారు. ఇస్లామ్ మతములో ముహమ్మద్ ప్రవక్త ఆఖరి ప్రవక్తయనీ, ఖుర్ఆన్ గ్రంథము అంతిమ దైవగ్రంథమని చెప్పుచున్నారు కదా! ఖుర్ఆన్ అంతిమ దైవగ్రంథమైనప్పుడు, ముహమ్మద్ ప్రవక్త ఆఖరి ప్రవక్త అయినప్పుడు, తర్వాత దేవుడు మనిషిగా రావలసిన పనిలేదు కదా! అలా వస్తే ముహమ్మద్ ఆఖరి ప్రవక్త అనుటకు భంగమేర్పడును కదా! అట్లే ఖుర్ఆన్ గ్రంథము అంతిమ గ్రంథము కాకుండా పోవును కదా! దీనికి మీరేమంటారు?

**జ॥** ఖుర్ఆన్ ఎప్పటికీ అంతిమ దైవగ్రంథమే, ఆ మాటను ప్రపంచము లో ఎవరూ కాదనలేరు. భూమిమీద తెలియకుండాపోయిన ధర్మములు తిరిగి తెలియబడుటకు దేవుడు మనిషిగా (దూతగా) వచ్చినా, భూమిమీద ధర్మములు పునరుద్ధరించబడినా, తెలియకుండాపోయిన ధర్మములు తెలియబడి మనిషి సంపూర్ణ జ్ఞానిగా మారినా, ఖుర్ఆన్ అంతిమ దైవ గ్రంథమనుటలో ఏ మార్పూ ఉండదు. ఖుర్ఆన్ శాశ్వతముగా అంతిమ దైవ గ్రంథమని గొప్ప జ్ఞానులు కూడా అనవలసిందే. ఎందుకనగా! సృష్ట్యాదిలో వాణి ద్వారా దేవుడు జ్ఞానము తెలియజేయగా ఆనాడు గ్రహములైన సూర్యుడు, జిబ్రయేల్ దేవుడు తెలియజేసిన జ్ఞానమును తెలియ

గలిగారు. సూర్యుని ద్వారా సృష్ట్యాదిలోనే భూమిమీద జ్ఞానము తెలియ బడినది. సూర్యుడు మొదట భూమిమీదగల మనువుకు జ్ఞానము తెలుపగా, మనువు ద్వారా ఇక్ష్వాకుడు అను రాజు తెలుసుకోగలిగాడు. ఇక్ష్వాకుని ద్వారా మిగత ప్రజలు తెలుసుకోగలిగారు. ఇట్లు భూమిమీద మొదట మనుషులందరికీ జ్ఞానము తెలియబడినది. అలా తెలియబడిన మొదటి జ్ఞానమే ఐదువేల సంవత్సరముల పూర్వము శ్రీకృష్ణుని ద్వారా అర్జునునికి చెప్పబడినది. అదియే వ్యాసుని ద్వారా భగవద్గీతగా వ్రాయబడినది. అందువలన భగవద్గీత ప్రపంచములో మొదటి దైవగ్రంథమైనది. మాటల రూపములో తెలుపబడిన గీతను అక్షర రూపములో వ్రాసి ప్రజలకు తెలియజేసిన వ్యాసున్ని మొదటి ప్రవక్తయని చెప్పవచ్చును. ఇకపోతే ఇప్పటికి పదునాలుగు వందల సంవత్సరముల పూర్వము జిబ్రయేల్ దూత హీరా గుహలో ముహమ్మద్ ప్రవక్తగారికి దైవజ్ఞానమును అందించాడు. జిబ్రయేల్ అందించిన జ్ఞానమును ముహమ్మద్ ప్రవక్తగారు ప్రజలకు ఖుర్ఆన్ రూపములో అందించాడు. అలా జిబ్రయేల్ చెప్పిన జ్ఞానము ఖుర్ఆన్ అను గ్రంథ రూపమైనది. మొదట చెప్పిన జ్ఞానమే ఖుర్ఆన్‌లో ఉండుట వలన, భగవద్గీత తర్వాత వచ్చిన జ్ఞానము ఖుర్ఆన్ అగుట వలన, గీత మొదటి దైవగ్రంథమైనపుడు, ఖుర్ఆన్ అంతిమ దైవగ్రంథమైనది. మొదట చెప్పినది ఎప్పటికీ మొదటిదే. తర్వాత మొదటి దానితో సమానముగా చెప్పినది ఖుర్ఆన్ తప్ప ఏ గ్రంథమూ లేదు కనుక ఖుర్ఆన్ అంతిమ దైవగ్రంథమైనది. మొదటిది మరియు చివరిది ఒకే జ్ఞానమైనందున మొదట చెప్పబడినది ప్రథమ దైవగ్రంథమనీ తర్వాత చెప్పబడినది అంతిమ దైవగ్రంథమనీ పేరుగాంచియున్నది. ఈ రెండిటికీ సమన్వయమున్నది కావున అలా చెప్పడము జరిగినది. సురా 12లో 111వ ఆయత్‌నందు "ఖురాన్‌లో చెప్పబడుతున్న ఇవన్నీ కల్పిత విషయములు కావు. వాస్తవానికి

ఇవి ఇదివరకు వచ్చిన గ్రంథాలకు ధృవీకరణ" అని కలదు. ఈ మాట వలన భగవద్గీతలోని జ్ఞాన విషయములు ఖుర్ఆన్ గ్రంథములో కూడా కలవని తెలియుచున్నది. దేవుడు చెప్పిన భగవద్గీతను అనుసరించియే ఖుర్ఆన్ కలదనీ, రెండిటిలోనున్నది సృష్టి ఆదిలో దేవుడు చెప్పిన జ్ఞానమేనని తెలియుచున్నది. రెండు గ్రంథములలోని జ్ఞానము ప్రజలు అర్థము చేసుకోలేనప్పుడు, దేవుడు అవతరించి గ్రంథములలోనున్న ధర్మములనే పునరుద్ధరించి పోవునుగానీ వీటిని కాదని వేరు జ్ఞానము చెప్పడు. దేవుడు మొదట చెప్పిన జ్ఞానము ముందు వెనుక తెలియబడడము వలన వాటికి మొదటి గ్రంథము చివరి గ్రంథము అని పేరు వచ్చినదిగానీ, అందులోని జ్ఞానము వేరనుకోకూడదు. దేవుడు ఎప్పుడు వచ్చి చెప్పినా తాను ముందు చెప్పిన వాటినే తిరిగి ప్రతిష్ఠించుటకు వచ్చునుగానీ తాను ముందు చెప్పిన జ్ఞానమును కాదనుటకు కాదు. దేవుడు వచ్చి ధర్మములను సంస్థాపించుట వలన పూర్వపు గ్రంథములైన మొదటి చివరి గ్రంథములలోని ధర్మములు బాగా అర్థము కాగలవు. అందువలన ఎంతకాలము జరిగినా ఆది అంత్య దైవగ్రంథములు ఎప్పటికీ శాశ్వతముగా ఉండగలవు. తిరిగి దేవుడు వచ్చి తెల్పునది ఈ ఆది అంత్య గ్రంథముల జ్ఞానమేనని తెలియవలెను.

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**

**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

# హిందూ రక్షణా! హిందూ భక్షణా!!

## 'భగవద్గీత'యే చదవనివాడు హిందూ రక్షకుడా?

## హిందూ ధర్మమే తెలియనివారు హిందూ రక్షకులా?

హిందువులు నేడు కులాలుగా చీల్చబడి, అందులో హెచ్చుతగ్గు కులములుగా వర్ణించబడియున్నారు అనుట అందరికీ తెలిసిన సత్యమే. దేవుడు మనుషులందరినీ సమానముగా పుట్టించితే, కొందరు మనుషులు తమ స్వార్థ బుద్ధితో హిందూ (ఇందూ) సమాజమును ముక్కలు ముక్కలుగా చీల్చి బలహీనపరచి హిందూసమాజమునకంతటికీ తామే గొప్పవారమనీ, తాము చెప్పినట్లే అందరూ విని అన్ని కార్యములు చేసుకోవాలని ప్రచారము చేసుకొన్నారు. ఎన్నో కులములుగా యున్న హిందూ సమాజములో తమ కులమే అగ్రకులమని చెప్పుకోవడమే కాకుండా, ఇతర కులముల వారందరికీ తామే మార్గదర్శకులమనీ, గురువులమనీ ప్రకటించుకొన్నారు. భవిష్యత్తులో తమకు ఎవరూ అడ్డురాకుండునట్లు, అన్ని కులములను అంటరాని కులములను చేసి, హిందూ సమాజమునకు తీరని అన్యాయము చేశారు. అంతటితో ఆగక నేటికినీ హిందూ సమాజ రక్షకులుగా చెప్పుకొనుచూ, హిందూ సమాజమును సర్వనాశనము చేయుచూ, హిందూ సమాజము ఇతర మతములుగా మారిపోవుటకు మొదటి కారకులగుచున్నారు. అటువంటివారు హిందూ సమాజమునకు చీడ పురుగులుగాయున్నా, మిగతా కులముల వారందరూ వారి నిజ స్వరూపమును తెలియక, వారు చెప్పినట్లే వినుట వలన హిందూ సమాజమును పూర్తిగా అజ్ఞాన దిశవైపుకు, అధర్మ మార్గమువైపుకు మళ్ళించి, ప్రజలకు ఏమాత్రము దైవజ్ఞానమును తెలియకుండా చేసి, తాము చెప్పునదే దైవబోధయని నమ్మించారు.

అటువంటి స్థితిలో నేడు త్రైతసిద్ధాంతకర్తగా శ్రీఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు అజ్ఞాన దిశవైపు నిలిచి పోయిన హిందూసమాజమును సరియైన దారిలో పెట్టుటకు, భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున బోధింపబడిన **క్షర, అక్షర, పురుషోత్తమ** అను ముగ్గురు పురుషుల సమాచారమును **"త్రైత సిద్ధాంతము"** అను పేరుతో ప్రతిపాదించి దైవజ్ఞానమును అందరికీ అర్థమగులాగున గ్రంథరూపములో వ్రాయడము, బోధించడము జరుగుచున్నది. దానివలన **నేడు ప్రజలు అసలైన జ్ఞానము తెలియుచున్నదని సంతోషపడుచున్నారు.** అగ్రకులముగా నున్న వారిలో కూడా ఎందరో తమ అజ్ఞాన చీకటులను వదలి, ఇంతవరకూ తమకు తెలియని జ్ఞానము యోగీశ్వరుల ద్వారా ఇప్పుడు తెలియుచున్నదని సంతోషపడి శిష్యులుగా చేరిపోవుచున్నారు. అయితే అగ్రకులములో కొందరు మాత్రము యోగీశ్వరులు తెలియజేయు జ్ఞాన విషయములను చూచి ఈ జ్ఞానము వలన **ప్రజలు జ్ఞానములో చైతన్యులై,** జ్ఞానము తెలియని తమను గౌరవించరని భావించి, దానివలన సమాజము మీద తమ ఆధిపత్యము లేకుండా పోవునని తలచి, యోగీశ్వరులు తెలుపుచున్న త్రైత సిద్ధాంతము గానీ, త్రైత సిద్ధాంత భగవద్గీతగానీ హిందువుల జ్ఞానమే కాదనీ, అది క్రైస్థవ మతమునకు సంబంధించినదనీ, దానిని ఎవరూ చదవకూడదనీ ప్రచారము చేయను మొదలుపెట్టారు. అంతేకాక తాము హిందూ ధర్మ రక్షకులమని, కొంత రాజకీయరంగు పూసుకొని, మా జ్ఞాన ప్రచారము నకు అక్కడక్కడ అడ్డుపడడము జరుగుచున్నది. తమ మాట విను ఇతర కులముల వారికి కూడా ప్రబోధానందయోగీశ్వరులు చెప్పు జ్ఞానము హిందూ జ్ఞానము కాదు, క్రైస్థవుల జ్ఞానమనీ హిందువుల ముసుగులో క్రైస్థవ మత ప్రచారము చేయుచున్నారని చెప్పడమేకాక, అటువంటివారిని ప్రేరేపించి మా ప్రచారమునకు అడ్డు తగులునట్లు చేయుచున్నారు.

యోగీశ్వరుల వారు నెలకొల్పిన హిందూ (ఇందూ) జ్ఞాన వేదిక ఇటువంటి ఆగడాలను కొంతకాలముగా ఓర్పుతో చూడడము జరిగినది. మాలో ఓర్పు నశించి, మమ్ములను అన్యమత ప్రచారకులుగా వర్ణించి చెప్పు అగ్రకులము వారిని, వారి అనుచరులను మేము ఎదురుదిరిగి ప్రశ్నించడము జరిగినది. మేము ప్రశ్నించిన ఒక్క ప్రశ్నకు కూడా వారు సరియైన సమాధానము ఇవ్వలేదు. ఆ జవాబులు ఎలా ఉన్నాయో పాఠకులుగా మీరే చూడండి.

**మా ప్రశ్న :-** ఇంతవరకు ఏ హిందువూ చేయని విధముగా ఊరూరు తిరిగి, ఊరులో ఇల్లిల్లూ తిరిగి హిందూ ధర్మములను ప్రచారము చేయుచున్నాము కదా! అటువంటి మమ్ములను మీరు అన్యమత ప్రచారకులుగా ఎందుకు చెప్పుచున్నారు?

**వారి జవాబు :-** హిందూమతములో ఎందరో స్వామీజీలు ఉన్నారు. వారు ఎవరూ ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేయలేదు. హిందువులు అట్లు ఎవరూ ప్రచారము చేయరు. క్రైస్థవులయితేనే బజారు బజారు, ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేస్తారు. మీరు హిందువుల ముసుగులో ఇల్లిల్లూ తిరిగి క్రైస్థవమును ప్రచారము చేయుచున్నారు.

**మా ప్రశ్న :-** మేము క్రైస్థవులమయితే భగవద్గీతను ఎందుకు ప్రచారము చేస్తాము?

**వారి జవాబు :-** మీరు ప్రచారము చేయునది 'త్రైత సిద్ధాంత భగవద్గీత'. అది క్రైస్థవులది. బైబిలుకే మీరు అలా పేరు పెట్టారు.

**మా ప్రశ్న :-** క్రైస్థవులు తమను క్రైస్థవులుగానే చెప్పుకుంటారు. అలాగే బైబిలును బైబిలుగానే చెప్పుకొంటారు. వారి ప్రచారము క్రైస్థవము, బైబిలు అయినప్పుడు అదే పేరుమీద ప్రచారము చేస్తారు తప్ప, హిందువులుగా

భగవద్గీత పేరుతో ఎందుకు ప్రచారము చేస్తారు? ఇంతవరకు అట్లు ఎక్కడా జరుగలేదు. ఏ మతమువారు ఆ మతము పేరు చెప్పుకొంటారు గానీ ఇతర మతము పేరు చెప్పరు. అంతెందుకు మీరు మా భగవద్గీతను తెరచి చూచారా? అందులో భగవద్గీత శ్లోకములున్నాయా? బైబిలు వాక్యము లున్నాయా?

**వారి జవాబు :-** త్రైత సిద్ధాంతమని యున్నది కదా! త్రైతము అంటే త్రిత్వము అని త్రినిటి అని మాకు బాగా తెలుసు.

**మా ప్రశ్న :-** హిందూ ధర్మములలో అద్వైత సిద్ధాంతమును ఆదిశంకరా చార్యుడు ప్రతిపాదించాడు. విశిష్టాద్వైతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు, ద్వైతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. ఇప్పుడు శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు '**త్రైత సిద్ధాంతము**'ను ప్రతి పాదించాడు. సిద్ధాంతకర్తలు, సిద్ధాంతములు వేరయినా అందరూ హిందువు లని మీరు ఎందుకు అనుకోలేదు?

**వారి జవాబు :-** మీ త్రైతసిద్ధాంత భగవద్గీతలో యజ్ఞములను చేయకూడదని వ్రాశారు కదా! నిజముగా భగవద్గీతలో అలా లేదు కదా!

**మా ప్రశ్న :-** మీరు హిందువులలో ముఖ్యులుగా వుండి అంత మూర్ఖముగా మాట్లాడితే ఎలా? **ప్రపంచమునకంతటికీ ఒకే భగవద్గీత** యుంటుంది గానీ, మీ భగవద్గీత, మా భగవద్గీతయని వేరుగా ఉండదు. భగవద్గీతకు వివరము ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా వారికి అర్థమయినట్లు చెప్పియుండవచ్చును గానీ, అందరికీ భగవద్గీత మూల గ్రంథమొక్కటేనని గుర్తుంచుకోండి. **త్రైత సిద్ధాంత భగవద్గీత అన్నిటికంటే సరియైన భావముతో యున్నదనీ,** చదివిన జ్ఞానులందరూ పొగడుచూయుంటే, మీ కులములో ఎందరో ప్రశంసించు చూయుంటే, మీకు కొందరికి మాత్రము వ్యతిరేఖముగా కనిపించిందనడము అసూయతోనే అని మాకు అర్థమగుచున్నది. యజ్ఞములు చేయవద్దని

మేము ఎక్కడా చెప్పలేదు. యజ్ఞముల వలన పుణ్యము వస్తుంది, స్వర్గము వస్తుంది అని చెప్పాము. యజ్ఞముల వలన మోక్షము రాదు, దేవుడు తెలియడని చెప్పాము. అంతెందుకు మీరు మేము అన్ని కులములకంటే స్వచ్ఛమయిన హిందువులమని చెప్పుకొంటున్నారు కదా! భగవద్గీతలో చెప్పిన **ఒక్క** హిందూ ధర్మమును చెప్పండి.

**వారి జవాబు :-** అవన్నీ మాటలు వద్దు... మీరు హిందువులు కాదు.

**మా ప్రశ్న :-** మొండిగా మాట్లాడవద్దండి. మీరు అగ్రకులము వారమని ఇష్టమొచ్చినట్లు మాట్లాడకండి. మేము హిందువులము కాము అనుటకు ఆధారము ఏమైనా చూపగలరా? మా కథ అట్లుంచి మీరు సరియైన హిందువులే అయితే భగవద్గీతలో విశ్వరూప సందర్శనయోగమను అధ్యాయములో **48వ శ్లోకములోనూ, 53వ శ్లోకములోనూ** భగవంతుడు ఏమి చెప్పాడో మీరే చెప్పండి.

**వారి జవాబు :-** మేము ఇంతవరకు భగవద్గీత చదువలేదు. మీకు కావలసి వస్తే సంపూర్ణానందస్వామితో చెప్పిస్తాము.

**మా ప్రశ్న :-** కనీసము భగవద్గీతను కూడా చదువని మీరు యోగీశ్వరులయిన ప్రబోధానందస్వామిని దూషించడము మంచిదా? ఒక్క హిందూ ధర్మమును కూడా తెలియని మీరు హిందూ ధర్మ రక్షకులమని చెప్పడము మంచిదా? యోగీశ్వరుల వారు వ్రాసిన ఒక్క గ్రంథము కూడా చదువకుండా మేము తప్ప పూజ్యులుగా, గురువులుగా ఎవరూ ఉండకూడదను అసూయతో ఇలాగ మాట్లాడితే దేవుడు ఓర్చుకోడని చెప్పుచున్నాము.

**వారి జవాబు :-** హిందూ మతములో ఎందరో దేవుళ్ళున్నారు. శివుడు దేవుడే, శివుని కొడుకు గణపతి దేవుడే, రాముడు దేవుడే, రాముని సేవకుడు ఆంజనేయుడు దేవుడే. అలాంటి హిందూ మతములో 'దేవుడు ఒక్కడే' అని చెప్పడము మీది తప్పు కాదా?

**మా మాట :-** మేము మతమును గురించి చెప్పలేదు. హిందూ మతములో ఎందరో దేవుళ్ళుండడము నిజమే, అయితే హిందూ జ్ఞానములో, హిందూ ధర్మము ప్రకారము **విశ్వమునకంతటికీ ఒకే దేవుడని** చెప్పాము. భగవద్గీతలో దేవుడు చెప్పినదే చెప్పాము తప్ప మేము దేవతలను గురించి లేరని చెప్పలేదే! దేవతలకందరికీ అధిపతియైన దేవుడు ఒక్కడున్నాడని, ఆయనే దేవదేవుడనీ, అతనిని ఆరాధించమని చెప్పాము.

**వారి జవాబు :-** మీరు రాముని పేరు చెప్పరు, శివుని పేరు చెప్పరు, వినాయకుని పేరు చెప్పరు. ఎవరి పేరూ చెప్పకుండా దేవుడు అనీ, 'సృష్టికర్త'యనీ అనేకమార్లు పేర్కొన్నారు. 'దేవుడు' అను పదమునుగానీ, 'సృష్టికర్త' యను పదమునుగానీ క్రైస్థవులే వాడుతారు. హిందువులు వాడరు. అందువలన మిమ్ములను హిందువులు కాదు క్రైస్థవులు అంటున్నాము.

**మా ప్రశ్న :-** క్రైస్థవ మతము పుట్టి రెండువేల సంవత్సరములయినది. సృష్టిపుట్టి ఎన్ని కోట్ల సంవత్సరములయినదో ఎవరూ చెప్పలేరు. సృష్ట్యాది నుండి **'సృష్టికర్త'** అను పదమును **'దేవుడు'** అను పదమును హిందూ సమాజము వాడుతూనే యున్నది. మొదటి నుండి హిందూసమాజములో యున్న దేవుడు, సృష్టికర్త అను పేర్లను హిందువులు క్రైస్తవులకేమయినా లీజుకిచ్చారా? లేక పూర్తిగా వారికే అమ్మేశారా? అని అడుగుచున్నాము. సృష్టికర్త అనిగానీ, దేవుడు అనిగానీ హిందువులయినవారు అనకూడదని ఎక్కడయినా ఉన్నదా అని అడుగుచున్నాము?

**వారి జవాబు :-** మీరు హిందూమతమును కాకుండా అన్యమతమును బోధించుచున్నారనుటకు, మిమ్ములను మీరు హిందువులుగా చెప్పుకోలేదు. హిందువులుగా కాకుండా ఇందువులుగా చెప్పుకొంటున్నారు. అటువంటప్పుడు మీరు హిందూమతమును చీల్చినట్లు కాదా! ప్రత్యేకించి

'ఇందూ మతము' అను దానిని ప్రచారము చేసినట్లు కాదా! మీరు హిందువులే అయినప్పుడు మీ గ్రంథములలోగానీ, మీ బోధలలో గానీ ప్రత్యేకించి 'ఇందువులు' అని ఎందుకు చెప్పుచున్నారు?

**మా మాట :–** మేము సూటిగా ఒక ప్రశ్నను అడుగుతాము జవాబు చెప్పండి. **'హిందువు, ఇందువు'** అను పదములో కొద్దిపాటి శబ్దము తప్ప ఏమి తేడాయుందో మీరే చెప్పండి. తెలుగు భాషను వ్రాసే వారందరూ హిరణ్యకశ్యపున్ని చంపినది నరశింహస్వామి అని చెప్పుచుందురు, అలాగే వ్రాయుచుందురు. ప్రస్తుత కాలములో నరశింహులు అని పేరున్నవాడు కూడా వాని పేరును నరశింహులు అని వ్రాయడము అందరికీ తెలుసు. అయితే ఆ మాట తప్పు అలా వ్రాయకూడదు దానిని **నరసింహ** అని వ్రాయవలెను అని చెప్పుచున్నాము. అడవిలో మృగరాజును **సింహము** అని అంటాము తప్ప **శింహము** అని అనము అని కూడా చెప్పుచున్నాము. 'సింహము' అంటే అర్థమున్నది గానీ, 'శింహము' అంటే అర్థము లేదు అని కూడా చెప్పాము. అలా ఉన్నది ఉన్నట్లు చెప్పితే **'ఇందువు'** అనే దానికి అర్థమున్నదిగానీ **'హిందువు'** అనే దానికి అర్థములేదు అని చెప్పాము. సృష్ట్యాదిలో పుట్టినది ఇందూ సమాజమనీ, అది మధ్యలో పేరుమారి దృష్ఠి జిష్ఠి అయినట్లు, 'ఇందూ' అను శబ్ధము 'హిందూ' అని పలుకబడుచున్నదని చెప్పాము. 'ఇందూ' పదము ఎందుకు వాడాలి, 'హిందూ' పదమును ఎందుకు వాడకూడదని కూడా వివరముగా మా గ్రంథములలో గలదు. ఉన్న **సత్యము** మీకు తెలిసినా, మీరు మాకంటే పెద్ద ఎవరూ ఉండకూడదను అసూయతో మాట్లాడుచున్నారు.

అగ్రకులములో ఎందరో పెద్దలు మా జ్ఞానమును తెలిసి సంతోషించుచుండగా, కొందరు మాత్రము వీధి రౌడీలలాగా తంతాము, పొడుస్తాము, కాలుస్తాము మీరు ప్రచారము చేయవద్దండని చెప్పడము

మంచిది కాదు. మా గ్రంథములు ఏదీ చదువకుండా మాట్లాడడమూ, మేము చెప్పిన మాటలను వినకుండా ఇవన్నీ డ్రామాలు, నాటకాలు అనడము మంచిది కాదు. మీరు ఎవరైనా మా గ్రంథములలో ఇతర మతములను ప్రచారము చేసినట్లుగానీ, ఫలానా మతములోనికి చేరమని చెప్పినట్లుగానీ ఉంటే నిరూపణ చేయండి, అలా నిరూపించినవారికి ఇందూ జ్ఞానవేదిక తరపున పది లక్షల రూపాయలను ఇవ్వగలము. నిరూపించ లేకపోతే మీరు లక్ష రూపాయలు ఏ ఊరిలోనయినా శ్రీకృష్ణుని గుడికి ఇవ్వవలెను. ఈ షరతుకు ఎవరైనా ముందుకు వస్తారా? అని అడుగుచున్నాము.

ఇట్లు

# ఇందూ జ్ఞానవేదిక

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**

**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

**తప్పక చదవండి!** **చదివించండి!!**

# దయ్యాల–భూతాల యదార్థ సంఘటనలు

విజ్ఞానరంగములో నాస్తికులకు కనువిప్పు, ఆధ్యాత్మికరంగములో ఆస్తికులకు మతివిప్పు. ఇది మహాశక్తివంతమైనది. ఈ గ్రంథమును చదువురానివారు విశ్వాసముతో దగ్గరుంచుకొనినా, చదువు వచ్చినవారు భక్తిభావముతో చదివినా ఇందులోని జ్ఞానము తెలియడమే కాక, అంతవరకు కొన్ని లక్షలరూపాయలు ఖర్చుచేసినా నయముకాని రోగములు నయమైపోవుట జరుగుచున్నది. దీనివలన శరీరలోపములు తప్ప రోగములన్నియూ చికిత్సకు అతీతముగా బాగై పోవుచున్నవి. దీనివలన దయ్యములు అంటే ఏమిటో, భూతములు అంటే ఏమిటో తెలిసిపోవును. మొట్టమొదటిసారిగా ఈ లోకానికి "దేవుని పరిపాలన" ఎలా వుంటుందో తెలియజేసినదీ గ్రంథ రాజము.

రచయిత : **త్రిమత ఏకైక గురువు, త్రైత సిద్ధాంత ఆదికర్త శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

